● రామకార్యంలో ఉడుతాభక్తిగా.... రామమందిర నిర్మాణంలో కరసేవకులు



అయోధ్యలో

# ఆగ్రహించిన హిందువు

రాంమాధవ్

నవభారతి ప్రచురణలు

ప్రథమ ముద్రణ
జనవరి, 1993

ప్రచురణ:
నవభారతి ప్రచురణలు
3-4-705/4, నారాయణగూడా,
హైదరాబాద్ - 500 029

టైప్ సెట్టింగ్:
జాగృతి గ్రాఫిక్స్
3-4-705/4, నారాయణగూడా,
హైదరాబాద్ - 29

ప్రింటింగ్:
భారత ముద్రణాలయం

ప్రతులకు:
సాహిత్య నికేతన్
3-4-705/4, నారాయణగూడా,
హైదరాబాద్ - 29

వెల: రూ. 4.00

# ముందుమాట

డిసెంబర్ 6వ తేదీన అయోధ్యలో సంభవించిన పరిణామాలు కుహనా లౌకికవాద శక్తులకు గొడ్డలిపెట్టులాంటివి. ఇంతకాలం వారు నిర్మించుకుంటూ వచ్చిన మిథ్యావాద సిద్ధాంత సౌధాలు ఆగ్రహించిన హైందవశక్తి ధాటికి కుప్పకూలిన రోజది.

ఈ సత్యాన్ని జీర్ణించుకోలేని ఆ శక్తులు దేశవ్యాప్తంగా అసత్య ప్రచారానికి, జాతీయవాద సంస్థల అణచివేతకు పాల్పడుతున్నాయి. ప్రభుత్వ, ప్రైవేటు ప్రచార సాధనాలను నిర్లజ్జగా దుర్వినియోగం చేస్తున్నాయి.

ఈ పరిస్థితులలో అయోధ్య సంఘటనల అసలు స్వరూపాన్ని ప్రజలకు అందించడమే ఈ పుస్తకం ధ్యేయం. అయోధ్య పరిణామాలను జాతీయదృష్టితో విశ్లేషించి మనకందిస్తున్న ఈ పుస్తకాన్ని మీరు చదవడమేకాక పలువురి చేత చదివించండి. మీ మిత్రులచేత, బంధువుల చేత కొనిపించండి.

గ్రామాలలో ఉన్న మీ సన్నిహితులకు మీరే కొని పంపించండి. గ్రామగ్రామానికి ఈ పుస్తకం చేరాలన్నది మా ఆకాంక్ష.

ఈ పుస్తకంలోని విషయాల ప్రచారానికి మీరు చేసే ప్రతి చిన్ని ప్రయత్నమూ జాతీయోద్యమానికి గొప్ప సహకారమే అవుతుందని మరువకండి.

మీ
సంపాదకులు

'బాబరీ మసీదు విధ్వంసం చేయబడింది' అంటూ ప్రధానమంత్రి శ్రీ పి.వి.నరసింహారావు కళ్ళనీళ్ళ పర్యంతంగా కంఠశోష పెట్టకుండా ఉండి ఉంటే...

'బాబరీ మసీదు కూల్చివేత అనాగరిక చర్య' అంటూ రాష్ట్రపతి శ్రీ శంకర దయాళ్‌శర్మ రాష్ట్రపతి భవన్‌నుండి ప్రత్యేక ప్రకటన విడుదల చేయకుండా ఉండి ఉంటే...

'బాబరీ మసీదుతో బాటు సెక్యులర్ వ్యవస్థకూడా కుప్పకూలి పోయింది' అంటూ శ్రీ వి.పి.సింగ్ వగైరా బూటకపు సెక్యులరిస్టులు దొంగ కన్నీళ్ళు కార్చకుండా ఉండి ఉంటే..

'నాలుగు వందల ఏళ్ళనాటి మసీదులోకి హిందువులు చొచ్చుకుపోయి దానిని విధ్వంసం చేశారు' అంటూ బ్రిటిష్ బ్రాడ్ కాస్టింగ్ కార్పొరేషన్ (బిబిసి) రెండు రోజులపాటు గంటకోసారి కాకిగోల చేయకుండా ఉండి ఉంటే...

.........భారత దేశం భగ్గున మండి ఉండేది కాదు, ప్రపంచంలోని వివిధ దేశాలలో .. ముఖ్యంగా ముస్లిం మతమౌఢ్య పాలకుల చేతుల్లో మగ్గుతున్న ఇరాన్, పాకిస్తాన్, బంగ్లాదేశ్‌వంటి దేశాలలో.. హిందువులపై విధ్వంసకాండ చెలరేగి ఉండేదికాదు.

డిసెంబర్ 7వ తేదీనుండి సాగిన అల్లర్లలో దేశవ్యాప్తంగా 12 వందలమంది (ఇది ప్రభుత్వ లెక్కల ప్రకారం, ఇతర అంచనాల ప్రకారం ఈ సంఖ్య 16 వందల వరకు ఉంది) ప్రాణాలు బలై ఉండేవి కావు.. వేలాది మంది ఆసుపత్రుల పాలై ఉండేవారు కారు. కోట్లాది రూపాయిల ఆస్తి బుగ్గిపాలై పోయేది కాదు...

వీటన్నింటికీ మించి ... హిందువులు, ముస్లింల మధ్య ఒక శాశ్వత ఇనుప తెర నిర్మాణం అయ్యేది కాదు...

## అసలేం జరిగింది?

అయోధ్యలో డిసెంబర్ 6వ తేదీన జరిగిన సంఘటనలకు ఎంతో ప్రాధాన్యత ఉంది. సుమారు 3 లక్షలమంది కరసేవకులు దేశం నలుమూలలనుండి ఆరోజున అక్కడకు చేరుకున్నారు. గత 8 సంవత్సరాలుగా విశ్వహిందూ పరిషత్ ఆధ్వర్యంలో సాగుతున్న రామజన్మ భూమి ఉద్యమంలో తాజా దశ అయిన కరసేవలో పాల్గొనేందుకు వారంతా సంకల్పం స్వీకరించి మరీ వచ్చారు.

వారంతా అక్కడకు చేరినది రామ మందిర నిర్మాణంలో సాధుసంతుల ఆదేశం మేరకు ప్రారంభం కానున్న నిర్మాణ కార్యక్రమంలో పాల్గొనడం కోసం మాత్రమే. ఆ నిర్మాణ కార్యక్రమం అయోధ్యలోని వివాదాస్పద రామజన్మభూమి కట్టడానికి ఆనుకుని ఉన్న 2.77 ఎకరాల స్థలంలో జరుగవలసి ఉంది.

మధ్యాహ్నం 12.గం. లకు కరసేవను ప్రారంభం చేయాలని సాధుసంతులు ముహూర్తం నిర్ణయించారు. పవిత్రమైన ఆ నిర్మాణ కార్యక్రమంలో దేశం నలుమూలల నుండి కులమత వర్గ వర్ణ ప్రాంత భాషాది విభేదాల కతీతంగా తరలి వచ్చిన లక్షలాది కరసేవకులతోపాటు తాము కూడా పాల్గొనాలనే సంకల్పంతో ఆరెస్సెస్ నాయకులు శ్రీ హెచ్.వి.శేషాద్రి, శ్రీ సుదర్శన్, విశ్వహిందూ పరిషత్ నేత శ్రీ అశోక్ సింఘల్, బిజెపి నాయకులు శ్రీ ఎల్.కె.అద్వానీ, డా.మురళీమనోహర్ జోషీ ఇంకా అనేకమంది పెద్దలు కూడా 6వ తేదీ ఉదయం 10.30 గం.లలోగా అయోధ్య చేరుకున్నారు.

కరసేవ సంకేత రూపంగా జరగాలన్నదే సాధుసంతులు, పెద్దలందరి నిర్ణయం. అది చాలా సహజమైన విషయం కూడా. ఎందుకంటే దేవాలయ నిర్మాణం అనేది నిపుణులైన శిల్పకారులు, మేస్త్రులకు మాత్రమే సాధ్యమయ్యే విషయం తప్ప సాధారణ ప్ర[illegible] చేయగలిగినది కాదు. కరసేవకులంతా అయోధ్య వరకు తరలి వచ్చినది దేవాలయ [illegible]ణం వెనుక సమస్త భారతదేశంలోని హిందూ సమాజమంతటి సమర్థన ఉందన్న వాస్తవాన్ని ప్రపంచానికి చాటి చెప్పడం మాత్రమే.

ఆ ఉద్దేశంతోనే 60 కోట్ల హిందూ సమాజానికి ప్రతినిధులైన ఆ మూడు లక్షల మంది కరసేవకులు తమ సంకల్పానికి సంకేతంగా సరయూనది నుండి పిడికెడు ఇసుకను తెచ్చి గతంలో శిలాన్యాసం జరిగిన స్థలంలో ఉంచాలని సాధుసంతులు ఆదేశించారు. ఆమేరకు కరసేవకులంతా పవిత్ర సరయూ నది నుండి దోసిళ్ళతో ఇసుకను తీసుకుని శిలాన్యాస స్థలంవద్దకు చేరుకున్నారు. నాయకుల, సాధుసంతుల

ఉపన్యాసాలు వింటూ కరసేవ ముహూర్తంకోసం ఎదురు చూడసాగారు వారంతా.

కరసేవకు నిర్ణయించిన ముహూర్తం దగ్గర పడుతున్నకొద్దీ కరసేవకులలో ఉద్విగ్నత పెరగడం ప్రారంభమైంది. కరసేవను నిరోధించడం కోసం అటు కేంద్ర ప్రభుత్వం, ఇటు న్యాయస్థానాలు చేస్తున్న ప్రయత్నాలను నాయకులు వివరిస్తూ ఉంటే వారి ఉద్రేకం తారాస్థాయిని చేరింది. 8 ఏళ్ళపాటు నియంత్రణలో ఉంచిన అగ్ని పర్వతం ఒక్కసారిగా బ్రద్దలైంది.

భారతజాతి హృదయంపై కళంకంలా నిలచి ఉన్న బాబరీ కట్టడం కరసేవకుల ఆగ్రహాన్ని రెట్టింపు చేసింది. హనుమంతుడే తమను ఆవహించాడా? అన్న చందంగా ఒక్కసారిగా వేలమంది ఆ కట్టడంవైపు దూసుకుపోయారు. హృదయాలలో హైందవ స్వాభిమానం కణకణ మండుతూండగా కసికొద్దీ ఆ కట్టడంపై దాడి చేశారు వారు. సరిగ్గా 5 గంటల తదుపరి ఆ కట్టడం కాస్తా నామరూపాలు మిగలకుండా పోయింది.

## అది మసీదా?

అయోధ్యలోని వివాదాస్పద కట్టడం కరసేవకుల ధాటికి నేలకూలిన వార్త తెలియగానే కుహనా లౌకికవాదుల కాళ్ళక్రింద పునాదులు కదిలిపోయాయి. ఇంతకాలం తాము ఆశ్రయిస్తూ వచ్చిన బూటకపు సెక్యులరిజానికి ప్రతీక అయిన ఆ బాబరీ కట్టడం నేలమట్టం కావడం తమ పాలిట మరణశాసనమేనని వారు బెదిరిపోయారు. కనుకనే 'హిందువులు మసీదును కూలగొట్టేశా'రంటూ దేశవిదేశాలలో పెద్ద ఎత్తున దుష్ప్రచారం ప్రారంభించారు.

ఆ దుష్ప్రచారం నిజమని నమ్మిన సాధారణ ముస్లిం, దేశంలో తన స్వమతానికి ఏదో ఘోరమైన అన్యాయం జరిగిపోయిందని భ్రమపడ్డాడు. అజ్ఞానంతో వీధిన పడ్డాడు. చివరికి సర్కారువారి తుపాకుల పాలిట పడ్డాడు.

అయోధ్య సంఘటనల తదుపరి జరిగిన మారణకాండకు, ఆ మారణకాండలో బలైపోయిన వందలాది ప్రజల ప్రాణాలకు పూర్తి బాధ్యత ఈరకమైన దుష్ప్రచారాన్ని సాగించిన వారిదే.

అయోధ్యలో కరసేవకుల చేతుల్లో నేలమట్టం చేయబడిన కట్టడం మసీదు ఎంత మాత్రం కాదు. ఎందుకంటే గత 56 సంవత్సరాలుగా ఆ కట్టడంలో ఎన్నడూ నమాజు అర్పించబడలేదు. ఆ మాటకొస్తే క్రీ.శ.1528లో విదేశీ దురాక్రమణదారుడైన బాబరు అయోధ్యలోని దేవాలయాన్ని ధ్వంసం చేసి ఆ కట్టడాన్ని నిర్మించిన తరువాత ఎన్నడూ నిరంతరాయంగా అక్కడ నమాజు జరగనేలేదు. ఆ స్థలాన్ని శ్రీరాముని జన్మభూమిగా విశ్వసించే హిందువులు దానిని తమ ఆధీనంలోకి తెచ్చుకునేందుకు అనేక పర్యాయాలు

పోరాటాలు సాగిస్తూ వచ్చారు. ఫలితంగా ఆ కట్టడం కొంతకాలం హిందువుల చేతుల్లోను, కొంతకాలం ముస్లింల చేతుల్లోను ఉంటూ వచ్చింది. ఫలితంగా అది పూర్తిస్థాయి మసీదుగా ఎన్నడూ రూపొందనే లేదు. 1936వ సంవత్సరం తరువాత అయితే ముస్లింలు ఆ కట్టడాన్ని ఉపయోగించడం పూర్తిగా మానివేశారు.

ఇదిలా ఉండగా 1949వ సంవత్సరంలో ఆ కట్టడంలోపల బాలరాముని విగ్రహాలు ప్రత్యక్షం అయ్యాయి. ఆనాటినుండి అది దేవాలయంగానే చెలామణీ అవుతోంది. ప్రభుత్వం నియమించిన అర్చకుని ద్వారా నిత్యపూజాదికాలు జరుగుతూనే ఉన్నాయి. 1986 వ సంవత్సరం తరువాత ప్రభుత్వ ఆదేశం మేరకు హిందువులు ఆ దేవాలయంలో విగ్రహాలు ప్రతిష్ఠింపబడి ఉన్న గర్భగుడి ప్రదేశంవరకు వెళ్ళి దర్శనం చేసుకుని వస్తున్నారు. ఏటా పంచకోసీ, ద్వాదశకోసీ పరిక్రమలు జరిగే దేవోత్థాన ఏకాదశి సమయంలో అయితే లక్షలాది హిందువులు ఆ బాలరాముని దర్శనార్థం విచ్చేస్తూ ఉంటారు. మొన్న నవంబర్ 5వ తేదీన జరిగిన ఆ పర్వదిన సమయంలో కూడా కనీసం 3 లక్షలమంది భక్తులు అయోధ్యను సందర్శించారని అంచనా.

కాగా ఆ కట్టడపు చుట్టుప్రక్కల 200 మీటర్ల పరిధిలోకి ముస్లింలు ఎవరూ ప్రవేశించరాదని కూడా కోర్టు ఆదేశాలు ఉన్నాయి. ఇది అయోధ్యలోని వివాదాస్పద కట్టడపు వాస్తవ స్థితి.

56 సంవత్సరాలుగా నమాజు జరగని చోటు, 200 మీటర్ల పరిధిలోకి ముస్లింలు ప్రవేశించడానికి సైతం అనుమతి లేని చోటు మసీదు ఎలా అవుతుంది? కనీసం 43 సంవత్సరాలుగా బాలరాముడు పూజలందుకుంటున్న స్థలం, ఏటా లక్షలాది హిందూ భక్తులు దర్శనార్థం విచ్చేసే స్థలం మసీదు ఎలా అవుతుంది?

డిసెంబర్ 6వ తేదీన కరసేవకుల ఆగ్రహాగ్ని జ్వాలలకు మట్టికరిచిన కట్టడం బాబరీ మసీదు ఎంతమాత్రం కాదు. అది బాబరు నిర్మించిన ఒక కట్టడం మాత్రమే. ఆ కట్టడంపైన హిందువులకు ఏమాత్రం నిష్ఠలేదు. కనుకనే దానిని వివాదాస్పద కట్టడంగా వారు భావిస్తూ వచ్చారు. ఇంతకాలం ప్రభుత్వం కూడా ఆ కట్టడాన్ని ఒక వివాదాస్పద కట్టడంగా మాత్రమే పరిగణిస్తూ వచ్చింది.

కానీ ఆ కట్టడం నేలకూలగానే మన కుహనా సెక్యులర్ నేతలకు దిమ్మ తిరిగింది. తమ క్షుద్ర రాజకీయ జీవితపు కూకటివేళ్ళపైనే దెబ్బ పడేసరికి తల తిరిగిన ఆ నేతలు మసీదు కూలిపోయిందంటూ రభస సృష్టించారు. సర్వసాధారణ ముస్లిం సమాజంలో భ్రమలను నిర్మాణం చేశారు. అవకాశం కోసం ఎదురు చూస్తున్న మతమౌఢ్య ముల్లా, మౌల్వీ ముస్లిం నాయకత్వం అమాయక ముస్లింలను రెచ్చగొట్టింది.

హిందువులు మసీదులను నేలమట్టం చేసేస్తున్నారన్న దుష్ప్రచారం వారిలో మత రక్కసిని పురికొలిపింది. వారు రోడ్డున పడ్డారు. దేశమంతటా, విదేశాలలోను ఘోరకలి ప్రారంభమైంది.

అమాయక హిందువులు వారి పాలిట పడ్డారు. నగరాలు రక్తసిక్తం అయ్యాయి. బస్తీలు బూడిద పాలయ్యాయి. వందల శవాలు, వేల క్షతగాత్రులు, కోట్ల రూపాయిల విధ్వంసం, కన్నీళ్ళు, కష్టాలు.... ఒక్క అసత్యం సృష్టించిన మారణహోమం ఇది.

ఈ అసత్యాన్ని సృష్టించిన వారెవరో బాధ్యతారహితులైన వ్యక్తులు కాదు. సాక్షాత్తు ప్రధానమంత్రి శ్రీ పి.వి.నరసింహారావు డిసెంబర్ 6వ తేదీ రాత్రి దూరదర్శన్‌లో జాతి నుద్దేశించి చేసిన ప్రత్యేక ప్రసంగంలో బాబరీ మసీదు కూలిపోయిందని ప్రకటించారు. స్వయంగా రాష్ట్రపతి శ్రీ శంకరదయాళ్ శర్మ అసాధారణ రీతిలో రాష్ట్రపతి భవన్‌నుండి చేసిన పత్రికా ప్రకటనలో మసీదు కూలిపోయిందని పేర్కొన్నారు. వీరిచ్చిన ప్రోత్సాహంతో కాంగ్రెస్, జనతాదళ్, కమ్యూనిస్టు పార్టీలకు చెందిన కుహనా లౌకికవాద నేతలంతా మసీదు కూలిపోయిందంటూ బుడిబుడి రాగాలు తీశారు.

డిసెంబర్ 6వ తేదీ రాత్రి అంతా ప్రశాంతంగా నిద్రించిన దేశం ఈ నాయకుల అసత్య ప్రచార ఫలితంగా 7వ తేదీ మధ్యాహ్నంనాటికి అతలాకుతలంగా మారింది. అగ్నిహోత్రం అయింది.

## ఇది కోర్టు ధిక్కారమే

అయోధ్యలో కూలినది మసీదని ప్రకటించిన వారు కేవలం అసత్య ప్రచారానికి పాల్పడడమేకాదు, కోర్టు ధిక్కారానికి కూడా పాల్పడినట్లు లెక్క. ఎందుకంటే గత 40 సంవత్సరాలుగా న్యాయస్థానాలు కూడా ఆ కట్టడాన్ని ఎన్నడూ మసీదుగా పరిగణించ లేదు. కనీసం మూడు సందర్భాలలో అవి ఆ కట్టడాన్ని దేవాలయంగా పరోక్షంగా అంగీకరించాయి.

1949లో ఆకట్టడంలో తొలిసారిగా విగ్రహాలు ప్రత్యక్షం అయినప్పుడు స్థానిక ముస్లింలు కొందరు ఆందోళన వ్యక్తం చేశారు. మన దేశంలో బూటకపు సెక్యులరిస్టులకు ఆరాధ్యదైవం అయిన అప్పటి ప్రధాని శ్రీ జవహరలాల్ నెహ్రూ ఆ విగ్రహాలను అక్కడి నుండి తొలగించమని ఆదేశించాడు. అయితే స్థానిక మేజిస్ట్రేట్ శ్రీ నాయర్ మాత్రం వాటిని అక్కడే ఉంచాలని తీర్పునిచ్చాడు.

1951లో న్యాయస్థానం ఆ విగ్రహాలకు నిత్యపూజలు జరగాలని ఆదేశించింది. ఆమేరకు రాష్ట్ర ప్రభుత్వ దేవాదాయ శాఖ ఒక పూజారిని నియమించింది. కోర్టు ఆదేశాల మేరకు ఆ పూజారి రోజూ ఆ కట్టడంలోకి వెళ్ళి పూజాదికాలు నిర్వహించేవాడు.

అతడికి ప్రభుత్వం జీతం కూడా చెల్లించేది.

ముస్లింలెవరూ ఆ కట్టడపు 200 గజాల పరిధిలోకి పోరాదని '60లో న్యాయస్థానాలు మరొక తీర్పు చెప్పాయి. 1986లో ఇచ్చిన చారిత్రాత్మక తీర్పులో ఫైజాబాద్ జిల్లా మేజిస్ట్రేట్ బాలరాముని విగ్రహాలను దగ్గరనుండి దర్శించుకునేందుకు హిందువులకు ఎటువంటి ఆటంకాలు ఉండరాదని ఆదేశించారు. ఆ ఆదేశాల మేరకు అప్పటి ఉత్తరప్రదేశ్ రాష్ట్ర కాంగ్రెస్ ప్రభుత్వం బాలరాముని విగ్రహం ఉన్న భాగానికి వేసిన తాళాలను తొలగించి హిందువుల దర్శనానికి ఏర్పాట్లు చేసింది. 1990లో ధేవోత్థాన ఏకాదశి సమయంలో పంచకోసి, ద్వాదశకోసి పరిక్రమలను నిరోధించాలని అప్పటి ముఖ్యమంత్రి శ్రీ ములాయంసింగ్ యాదవ్ ప్రయత్నించినప్పుడు కూడా న్యాయస్థానాలు ఆ చర్యకు అంగీకరించలేదు. అయోధ్యలో శ్రీరామ జన్మభూమిని సందర్శించగోరే భక్తులకు ఎటువంటి ఆటంకాలు కలిగించరాదని కోర్టులు శ్రీ ములాయంసింగ్‌ను స్వయంగా ఆదేశించాయి.

గత 40 సంవత్సరాలుగా న్యాయస్థానాలలో ఈ వివాదం నలుగుతోంది. అయితే ఇంతవరకు ఒక్క పర్యాయం కూడా న్యాయస్థానాలు ఆ కట్టడాన్ని మసీదుగా పిలిచే సాహసం చేయలేదు. కనుక కూలిన ఆ కట్టడం మసీదేనంటూ నాయకులు చేసిన ప్రచారం సాధారణ ముస్లింలను మోసం చేయడమే కాకుండా న్యాయవ్యవస్థను సైతం ధిక్కరించడం క్రిందే లెక్క.

## కుహనా లౌకికవాదంపై ప్రత్యక్ష చర్య

'మరి ఈ కట్టడం మసీదు కానప్పుడు, మందిరమే అయినప్పుడు దానిని కూల్చివేయవలసిన అవసరం ఏమొచ్చింది? ఇది హిందువులలో ముస్లిం ద్వేషాన్ని పెంచి రాజకీయ ప్రయోజనాలు పొందడం కోసం జరుగుతున్న కుట్రే' అంటూ కొందరు కుహనా మేధావులు బల్లగుద్ది మరీ వాదిస్తున్నారు.

మసీదులను కూల్చి ముస్లిం ద్వేషాన్ని హిందువులలో నిర్మాణం చేయడమే హిందూ సంస్థల లక్ష్యమైతే అందుకు వారు మారుమూలన ఉన్న అయోధ్యలోని పాడుపడిన కట్టడాన్ని ఎందుకు ఎన్నుకునేవారు? ఢిల్లీలోని జమా మసీదునో, మరొక కట్టడాన్నో ఎందుకు ఎన్నుకునేవారు కాదు? పైగా కూల్చివేతే లక్ష్యమైతే అన్ని లక్షలమంది అన్ని కష్టాలు పడి అక్కడికి చేరుకోవలసిన అవసరం ఏముంది? ఏ బాంబుతోనో పని పూర్తిచేయలేక పోయేవారా? అన్న సాధారణ ప్రశ్నలకు ఈ మేధావుల వద్ద సమాధానం ఉండదు.

మసీదులను కూల్చడం హిందూ సంస్థల కార్యక్రమం కాదు. హిందువుల రక్తంలోనే

అది లేదు. అయితే అయోధ్యలోని కట్టడం కుహనా లౌకికవాదానికి ప్రతీకగా మారింది. మన బూటకపు సెక్యులరిస్టుల ద్వంద్వ ప్రమాణాలకు అది సంకేతంగా నిలిచింది. జవహర్‌లాల్ నెహ్రూ-బ్రాండ్ సెక్యులరిజానికి బాబరీ కట్టడం ఒక నమూనా అయింది. కనుకనే బూటకపు సెక్యులరిజానికి, జాతీయవాదానికి మధ్య జరుగుతున్న పోరాటంలో ఆ కట్టడం కేంద్ర బిందువు అయింది. చివరికి జాతీయవాదుల ధాటికి నేలకూలింది.

## కరసేవకుల ఆవేశానికి కారకులెవరు?

డిసెంబర్ 6న అయోధ్యలో జరిగిన సంఘటనలు పథకం ప్రకారమే జరిగాయా? లేక యాదృచ్ఛికంగా జరిగాయా? అన్న మీమాంస కాటికి కాళ్ళు జాపుకున్నవారికి కాలక్షేపానికి పనికి రావచ్చేమోగానీ ప్రస్తుత పరిస్థితులలో ఆ ప్రశ్నలకు పెద్ద ప్రాధాన్యత లేదు. పథకం ప్రకారం జరిగినా, యాదృచ్ఛికంగా జరిగినా ఆ సంఘటనలు ఆ కట్టడంపట్ల మొత్తం హిందూ సమాజానికిగల ద్వేషానికి, అసహ్యానికి సంకేతం మాత్రమే.

నిజానికి కట్టడం విధ్వంసం ఇవాళ కాకపోతే రేపైనా జరిగి తీరేదే. అయితే ఎప్పుడో ఒకప్పుడు జరుగక తప్పని ఈకార్యం ఇంత త్వరగా పూర్తికావడానికి కారణమెవరన్నదే ప్రశ్న.

విశ్వహిందూ పరిషత్, సాధుసంతులు డిసెంబర్ 6వ తేదీన తలపెట్టిన కరసేవ 2.77 ఎకరాల భూమికే పరిమితమన్నది నిర్వివాదాంశం. వారి కరసేవ పథకంలో ఎక్కడా వివాదాస్పద కట్టడం లేనేలేదు. కరసేవకు తరలివచ్చిన లక్షలాది హిందూ సోదరీసోదరుల మనస్సులలో ఉన్నది కూడా అదే.

కానీ కేంద్ర ప్రభుత్వపు దుందుడుకు చర్యలొక ప్రక్క, న్యాయస్థానాల నత్తనడక పైఖరి మరొక ప్రక్క కలిసి కరసేవకులను రెచ్చగొట్టాయి. అదే చివరికి బాబరీ కట్టడపు విధ్వంసానికి దారితీసింది.

హిందువుల సహనాన్ని పరీక్షించవద్దని రాష్ట్రీయ స్వయంసేవక సంఘ అధినేత శ్రీ బాలాసాహెబ్ దేవరస్ విజయదశమి సందర్భంగా నాగపూర్‌లో చేసిన ప్రసంగంలో ప్రభుత్వాన్ని హెచ్చరించారు. ఆ హెచ్చరికను ప్రభుత్వం పెడచెవిన పెట్టింది. సాధు సంతులు ఇచ్చిన నాలుగు మాసాల గడువును దుర్వినియోగం చేసింది. ప్రశాంతంగా జరుపతలపెట్టిన కరసేవను నిరోధించే ప్రయత్నాలు చేసింది. పెద్ద ఎత్తున సైన్యాన్ని దింపి భయోత్పాతాన్ని నిర్మించింది. సామరస్యంతో, శాంతితో పరిష్కరించవలసిన సున్నితమైన అంశాన్ని తెగేవరకు లాగింది కేంద్ర ప్రభుత్వం. ఫలితమే కరసేవకుల తీవ్ర ప్రతిక్రియ.

న్యాయస్థానాలు కూడా తమ విద్యుక్త ధర్మాన్ని నిర్వర్తించడంలో విఫలం అయ్యాయి.

జస్టిస్ డిలేడ్ ఈజ్ జస్టిస్ డినైడ్(Justice delayed is justice denied) అన్న ప్రాథమిక సూత్రాన్ని అవి అతిక్రమించాయి. కావాలని జాప్యం చేశాయి. 1949వ సంవత్సరం నుండి అయోధ్య వివాదం న్యాయస్థానాల్లో నలుగుతోంది. మొట్టమొదటి క్రిమినల్ కేసు 145వ సెక్షను క్రింద నమోదు చేయబడింది. ఆ తదుపరి 11 సివిల్ కేసులు, అరడజను రిట్లు స్వీకరించబడ్డాయి. మనం 1993వ సంవత్సరంలో ప్రవేశిస్తున్నాం. అంటే కనీసం 42 సంవత్సరాలు పూర్తయాయన్నమాట. అయితే ఇప్పటివరకు ఒక్క సాక్షిని విచారించ డంగానీ, ఒక్క కేసులో తీర్పు చెప్పడంగానీ జరుగలేదంటే మన న్యాయస్థానాలు ఎంత మందకొడిగా వ్యవహరిస్తున్నాయో గ్రహించవచ్చు. మౌలిక సమస్యను ప్రక్కనపెట్టినా, తక్షణ వివాదాలైన శిలాన్యాసస్థల యాజమాన్యం వగైరా కేసులలో కూడా కోర్టులు అంతులేని జాప్యాన్ని ప్రదర్శించాయి. ఫలితంగా కరసేవకులలో పట్టుదల మరింత పెరగడానికి అవి కారణం అయ్యాయి.

అయోధ్యలో డిసెంబర్ 6న జరిగిన సంఘటనలకు బిజెపి, విశ్వహిందూ పరిషత్, రాష్ట్ర ప్రభుత్వాలదే బాధ్యత అంటూ పాపమంతా వారి నెత్తిన రుద్దే ప్రయత్నం చేస్తున్న కేంద్ర ప్రభుత్వం, న్యాయస్థానాలు ఇందులో తమ బాధ్యత నుండి ఏమాత్రం తప్పించుకోజాలవు.

మెజారిటీ హిందువుల మనోభావాలను గౌరవించకుండా తాము మనుగడ సాగిం చలేమని ప్రభుత్వం గ్రహించడం అవసరం. మరోప్రక్క నిష్పాక్షికత, సమయబద్ధతలే న్యాయవ్యవస్థపట్ల ప్రజల విశ్వాసానికి కొలమానం అవుతాయన్న సత్యాన్ని న్యాయస్థా నాలు కూడా నేర్చుకోవాలి.

## ఎవరు ఎవరిని మోసం చేశారు?

అయోధ్యలో బాబరీ కట్టడం కూలిన వెంటనే ప్రధాని శ్రీ పి.వి.నరసింహారావు ప్రదర్శించిన ప్రతిక్రియను ఇంగ్లీషులో అయితే 'పానిక్ రియాక్షన్' (Panic Reaction) అని పిలవవచ్చు. తాను ఘోరంగా వంచించబడ్డానని ఆయన వాపోయాడు. రాష్ట్ర ప్రభుత్వం, సంఘ పరివార్‌లు రెండూ కలిసి కుట్రపన్ని తనకు నమ్మక ద్రోహం చేశాయని ఆయన కళ్ళనీళ్ళ పర్యంతంగా ప్రకటించాడు.

ప్రధానప్రశ్న ఎవరిని ఎవరు మోసం చేశారన్నది.

గత జూలైలో అయోధ్యలో సాధుసంతుల ఆదేశం మేరకు కరసేవ ప్రారంభమైంది. ఈ కరసేవ గతంలో శిలాన్యాసం జరిగిన స్థలంలోనే ప్రారంభమైంది. ఈ స్థలం వివాదాస్పద కట్టడాన్ని అనుకుని ఉంటుంది. దాని విస్తీర్ణం 2.77 ఎకరాలు. శ్రీ కల్యాణ్‌సింగ్ నాయకత్వంలోని ఉత్తరప్రదేశ్ బిజెపి ప్రభుత్వం ఆ స్థలాన్ని స్వాధీనం చేసుకుని రామజన్మభూమి నిర్మాణ సమితికి అప్పగించింది. అయితే ఈ స్వాధీనంపై

అలహాబాద్ హైకోర్టులో కేసు నడుస్తూ ఉండడంతో ఆస్థలంలో శాశ్వత నిర్మాణాలేవీ చేపట్టరాదని న్యాయస్థానం కోరింది. ఆ మేరకు జూలై 9న ప్రారంభించిన కరసేవలో ఒక తాత్కాలిక వేదిక నిర్మాణాన్ని విశ్వహిందూ పరిషత్ ప్రారంభించింది.

అప్పటివరకు అయోధ్య వివాదం గురించి నిమ్మకు నిరెత్తినట్లు కూర్చున్న ప్రధాన మంత్రి ఒక్కసారిగా ఉలిక్కిపడి లేచారు. కరసేవను తాత్కాలికంగా నిలుపు చేయమని, అయోధ్య సమస్యను తాను తప్పక పరిష్కరిస్తానని ఆయన బిజెపి నాయకులు శ్రీ ఎల్.కె.అద్వానీని అర్థించారు. కరసేవను నిలుపు చేసే విషయంలో శ్రీ అద్వానీ తన అశక్తతను తెలిపారు. ఆ కార్యక్రమం మొత్తం సాధుసంతుల ఆదేశం మేరకు సాగుతోందని, కనుక ప్రధానమంత్రి నేరుగా వారితోనే చర్చలు జరపాలని శ్రీ అద్వానీ సూచించారు. సాధుసంతులకు, ప్రధానమంత్రికి మధ్య ప్రత్యక్ష సమావేశం ఏర్పాటుకు చొరవ తీసుకునేందుకు కూడా శ్రీ అద్వానీ అంగీకరించారు.

జూలై 23వ తేదీన రామజన్మభూమి ఉద్యమానికి సారథ్యం వహిస్తున్న అయిదుగురు ప్రముఖ ధర్మాచార్యులు - సంత్ వామదేవ్‌జీ మహరాజ్, మహంత్ అవైద్యనాథ్, యుగపురుష్ పరమానంద్, పరమహంస రామచంద్రదాస్, సంత్ నృత్యగోపాలదాస్ - ప్రత్యేక విమానంలో ఢిల్లీకి చేరుకున్నారు. నిజానికి ఆ సమయంలో వారంతా అయోధ్యలో చాతుర్మాస దీక్షలో ఉన్నారు. చాతుర్మాస దీక్షా సమయంలో దీక్షా స్థలాన్ని వదిలి వెళ్ళడం అపచారం. అయినప్పటికీ జాతీయ ప్రయోజనాల దృష్ట్యా, అయోధ్య విషయంలో సంఘర్షణను నివారించే సదుద్దేశంతో వారు తమ నియమ నిష్ఠలను ప్రక్కన పెట్టి ప్రధాని ఆహ్వానం మేరకు ఆయనను కలుసుకునేందుకు వచ్చారు.

ప్రధానమంత్రితో 15 నిమిషాలసేపు జరిగిన సమావేశంలో సంత్ వామదేవ్‌జీ రామజన్మభూమి విషయంలో హిందువుల మనోభావాలను గౌరవించవలసిన అవసరాన్ని గురించి నొక్కి చెప్పారు. ఈ వివాదం న్యాయస్థానాల పరిధిలోకి వచ్చేదికాదని కూడా ఆయన స్పష్టంచేశారు.

సాధుసంతుల నిర్ణయాలను విన్న తదుపరి ప్రధానమంత్రి తనకు మూడు నెలలు గడువు ఇప్పించవలసిందని, ఆ వ్యవధిలోగా అయోధ్య వివాదానికి తప్పక పరిష్కారం కనుగొనగలనని సాధుసంతులను అర్థించారు.

ప్రధాని మాటలను విశ్వసించక పోవడానికి సాధుసంతులకు కారణమేమీ కనిపించలేదు. పైగా వారు తనకు కొంత వ్యవధిని ఇవ్వడానికి నిరాకరించినట్లైతే తాను రాజీనామా చేయడం మినహా మరొక గత్యంతరం ఉండబోదని కూడా ప్రధాని వాపోయాడు. దాంతో శాంతి కాముకులైన సాధుసంతులు కరసేవను తాత్కాలికంగా వేరేచోటికి తరలించడానికి అంగీకరించారు.

ఆ మేరకు జూలై 26వ తేదీనుండి కరసేవను 2.77 ఎకరాల శిలాన్యాస స్థలం నుండి మార్చి, కట్టడానికి మరో ప్రక్కనగల స్థలంలో శేషావతార మందిర నిర్మాణానికి తరలించారు. అయోధ్య వివాదానికి ఒక సామరస్య పూర్వక పరిష్కారాన్ని కనుగొనేందుకు ప్రధానమంత్రికి మూడు నెలల వ్యవధిని వారు ఇచ్చారు.

ఆ సాధుసంతులే తనను మోసం చేశారని శ్రీ రావు ఆరోపించడం విడ్డూరంగా లేదూ?

## ప్రధాని చేసినదేమిటి?

నిష్కల్మష హృదయంతో సాధుసంతులు మూడు నెలల గడువును ఇస్తే ఆ వ్యవధిలో ప్రధానమంత్రి శ్రీ రావు చేసినదేమిటి? అయోధ్య సమస్యకు పరిష్కారాన్ని వెతికేందుకు ప్రయత్నించకపోగా రామమందిర ఉద్యమాన్ని దెబ్బతీసేందుకే ఆ సమయాన్ని ఆయన వినియోగించుకున్నారు. తనపై విశ్వాసం ఉంచి తనకు వ్యవధినిచ్చిన సాధుసంతులతో రాజకీయ క్రీడలు ప్రారంభించి తన నిజస్వరూపం బైట పెట్టుకున్నారు. మోసపూరిత వ్యవహారంతో ఉద్యమంలో విభేదాలు నిర్మాణం చేసేందుకు ప్రయత్నించారు.

సాటి రాజకీయ పార్టీలతో రాజకీయపు ఎత్తుగడలకు పాల్పడడం అనేది రాజకీయాలలో సర్వసాధారణ విషయం. కాంగ్రెస్ బిజెపితోను, బిజెపి కాంగ్రెస్‌తోను రాజకీయపు క్రీడలు సాగిస్తే ఎవరూ అభ్యంతరం పెట్టరు. కానీ ఇక్కడ ఒక గౌరవనీయ ప్రధానమంత్రి సర్వసంగ పరిత్యాగులు, నిష్కల్మషులు అయిన సాధుసంతులతో క్షుద్ర రాజకీయాలాడడం ప్రారంభించారు. తనపై విశ్వాసముంచి, నిష్కల్మష హృదయంతో నాలుగు మాసాల వ్యవధిని తనకివ్వడానికి సిద్ధపడిన సాధుసంతులనే మోసగించేందుకు, తప్పుదోవ పట్టించేందుకు ఆయన ఉద్యుక్తుడయ్యారు.

ఈ దిశలో ప్రధాని శ్రీ రావు వేసిన మొదటి అడుగు సాధుసంతులతో సమావేశం ముగిసిన తదుపరి పార్లమెంటులో చేసిన ప్రకటన. అయోధ్య సమస్యపై ప్రభుత్వ వైఖరిని వివరిస్తూ చేసిన ఆ ప్రకటనలో ప్రధానమంత్రి అయోధ్య వివాదానికి సంబంధించి అన్ని అంశాలను సుప్రీంకోర్టుకు నివేదించడానికి, ఆ కోర్టు ఇచ్చే తీర్పుకు అందరూ బద్ధులై ఉండడానికి సాధుసంతులు అంగీకరించారని అసత్యం పలికారు. హిందూసమాజంలో గందరగోళాన్ని, సాధుసంతులపట్ల విశ్వాసరాహిత్యాన్ని నిర్మాణం చేయడానికి ప్రధాని ఉద్దేశ పూర్వకంగా వేసిన ఎత్తుగడలో భాగమే ఈ ప్రకటన అని గ్రహించిన సాధుసంతులు తీవ్రంగా స్పందించారు.

సాధారణంగా పరమ శాంత స్వరూపులైన జ్యోతిష పీఠాధీశ్వరులైన జగద్గురు శంకరాచార్య స్వామి వాసుదేవానంద సరస్వతి సైతం ప్రధాని ప్రకటనను తీవ్రంగా

ఖండించారు. తాము ప్రధానికి అటువంటి హామీ ఏదీ ఇవ్వలేదని ఆయన స్పష్టంచేశారు. అయోధ్య సమస్యకు పరిష్కారం న్యాయాలయాల పరిధిలో లేదన్న తమ వాదనలో ఏ మాత్రం మార్పు లేదని ఆయన ప్రకటించారు. ప్రధాని సాధుసంతులతో మోసపూరిత వ్యవహారం సాగిస్తున్నారా? అన్న సందేహాన్ని కూడా ఆయన వెలిబుచ్చారు.

సాధుసంతుల ఈ సందేహం ఆధారరహితం కాదన్న విషయం అనతికాలంలోనే వెల్లడైంది. ఒకప్రక్క సాధుసంతులతో తాను అయోధ్య సమస్యను పరిష్కరిస్తున్నానని నమ్మబలుకుతూనే ప్రధానమంత్రి రెండోప్రక్క ముస్లిం మతమౌఢ్య ముల్లా, మౌల్వీలతో చేతులు కలిపి పరిష్కారాన్ని మరింత జటిలం చేయడం ప్రారంభించారు.

ఈ ఎత్తుగడలో భాగంగానే ప్రధానమంత్రి రాజకీయ సలహాదారు అయిన శ్రీ జితేంద్ర ప్రసాద్ అనేకమంది మతమౌఢ్య ముస్లిం నేతలతో చర్చలు జరిపారు. శ్రీ జితేంద్ర ప్రసాద్ చర్చలు సాగించిన వారిలో సయ్యద్ షహబుద్దీన్, నాయిబ్ ఇమామ్ వగైరాలు ఉన్నారు. హిందూ సంస్థలు ప్రధానమంత్రిపై ఒత్తిడి తెస్తున్నాయని, కనుక ముస్లిం నాయకులు వివాదాన్ని సాగతీయడానికి మరిన్ని ప్రయత్నాలు చేయాలని ఆయన వారికి చెప్పారు. అయోధ్యలో ఆలయం ఉండేదనడానికి గతంలో విశ్వహిందూ పరిషత్ ప్రతిపాదించిన ఆధారాలు చాలవని, మరిన్ని ఆధారాలు కావాలని కోరమని ఆయన వారిని ప్రోత్సహించారు.

మరోప్రక్క ప్రధానమంత్రి శ్రీ పి.వి.నరసింహారావు ఆగస్ట్ 15వ తేదీనాడు స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా ఎఱ్ఱకోటపై నుండి జాతినుద్దేశించి చేసిన ప్రసంగంలో 'బాబరీ మసీదు'ను తన ప్రభుత్వం ఎట్టి పరిస్థితులలోను కాపాడి తీరుతుందని ప్రకటించి, తన నిజస్వరూపాన్ని నగ్నంగా బట్టబయలు చేశారు. అయోధ్యలోని వివాదాస్పద కట్టడాన్ని స్వయంగా శ్రీ రాజీవ్‌గాంధీ కూడా ఏనాడూ మసీదుగా పిలవలేదు. దానిని 'మసీదు'గా సంబోధించిన మొదటి ప్రధాని శ్రీ పి.వి.యే. అదీ సాధుసంతులకు వాగ్దానం చేసి మూడు వారాలు గడవక ముందే.

ప్రధాని రెండు నాల్కల ధోరణి సాధుసంతులకు ఆగ్రహం కలిగించింది. సంపూర్ణ విశ్వాసంతో తాము నాలుగు నెలల సమయాన్ని ఇస్తే ప్రధాని విశ్వాసఘాతుక రీతిలో, రెచ్చగొట్టే ధోరణిలో వ్యవహరించడం చూసి వారు కలత చెందారు. వివాదిత కట్టడాన్ని బాబరీ మసీదుగా అభివర్ణించడంపట్ల అభ్యంతరం తెలియజేస్తూ సంత్ వామదేవ్‌జీ మహరాజ్ ప్రధానమంత్రికి వెంటనే ఒక లేఖ వ్రాశారు.

సాధుసంతులతో తన నమ్మకద్రోహ వైఖరికి మరొక నిదర్శనంగా ప్రధానమంత్రి ఆగస్ట్ 17నాడు మతమౌఢ్య ముస్లిం నాయకత్వంతో సమావేశం జరిపారు. ఆ సమావేశంలో ముస్లిం పర్సనల్ లా బోర్డు అధ్యక్షుడు ఆలీమియా, మౌలానా సలీం కాజ్మీ,

మౌలానా అబ్దుల్ అజరాబీ, మౌలానా ముఫ్తి అష్రఫ్ వంటి మతమౌఢ్య ముల్లాలతో బాటు సులేమాన్ సేఠ్, బనత్‌వాలా, సలాఉద్దీన్ ఓవైసీ, సయ్యిద్ షహాబుద్దీన్ వంటి మతమౌఢ్య నాయకులు కూడా పాల్గొన్నారు. మరునాడు మళ్లీ ఆలీమియాతో ప్రధాని ప్రత్యేక సమావేశం జరిపారు. ఆ రెండు సమావేశాలలోను ప్రధాన మంత్రి బాబరీ మసీదును ఎట్టి పరిస్థితులలోనూ వేరేచోటికి తరలించడం జరగదని, అన్ని విధాల దానిని తమ ప్రభుత్వం కాపాడుతుందని హామీ ఇచ్చారు.

ఆగస్ట్ 24 వ తేదీన ఢిల్లీలో సమావేశమైన మందిర జీర్ణోద్ధరణ సమితి సభ్యులైన సాధుసంతులు, తదితరులు ప్రధాని అనుసరిస్తున్న ఈ ద్వంద వైఖరిని సమగ్రంగా పరిశీలించారు. రామ మందిర ఉద్యమాన్ని దెబ్బతీయడానికే ప్రధాని ఎత్తుగడలు వేస్తున్నారని వారు నిర్ణయానికి వచ్చారు. ఈ పరిస్థితులలో భవిష్యత్తు కార్యాచరణను నిర్ణయించడం కోసం అక్టోబర్ 30,31 తేదీలలో ధర్మ సంసద్ సమావేశం జరపాలని కూడా వారు తీర్మానించారు.

ఒకప్రక్క ప్రధాని తమను మోసగిస్తున్నారని తెలిసి కూడా సాధుసంతులు ఆయనకు ఇచ్చిన వ్యవధిని ఉపసంహరించుకోక పోవడం వారి ఔదార్యానికి చిహ్నం. అక్టోబర్ 23వ తేదీకి మూడు నెలల వ్యవధి పూర్తయిన తదుపరి మాత్రమే భవిష్యత్తు కార్యాచరణను నిర్ణయించాలని వారు తీర్మానించారు.

## కృతఘ్నతకు పరాకాష్ఠ

సాధుసంతులు చూపిన ఔదార్యానికి కనీసం కృతజ్ఞతా పూర్వకమైన వ్యవహారమైన శ్రీరావు ప్రదర్శించకపోవడం ఆయన కుటిల రాజకీయ వ్యవహార శైలికి ఒక నిదర్శనం. తన వైఖరి సాధుసంతులకు మనస్తాపాన్ని కలిగిస్తోందని తెలిసికూడా దానిని మార్చుకునేందుకు ఆయన ఎటువంటి ప్రయత్నమూ చేయలేదు. పైపెచ్చు సాధుసంతులలోనే చీలికలు తెచ్చేందుకు తాజాగా ప్రయత్నాలు ప్రారంభించారు.

ఈ ప్రయత్నాలలో భాగంగా ఆయన చంద్రస్వామిని రంగంలోకి దించారు. ప్రపంచ వ్యాప్తంగా వివాదాలకు కేంద్రమైన చంద్రస్వామిపై ఆధారపడడం ప్రధాని నీచరాజకీయాలకు పరాకాష్ఠ. ప్రధాని ప్రోద్బలంతో చంద్రస్వామి హరిద్వార్‌లోను, ఇతర ప్రాంతాలలోను ఉన్న సాధుసంతులతో సమావేశాలు జరిపాడు. అయోధ్య సమస్య విషయంలో అనేక ప్రత్యామ్నాయ సూత్రాలను ప్రతిపాదించాడు. అన్నింటి సారాంశంమాత్రం ఒక్కటే. మందిర నిర్మాణం వివాదిత కట్టడానికి ప్రక్కన జరగాలి. విశ్వహిందూ పరిషత్, దానితో సంబంధం ఉన్న ఇతర సంస్థలను దూరంగా ఉంచాలి.

సాధుసంతులను ఒప్పించేందుకు చంద్రస్వామి ఎంత దూరం వెళ్ళాడంటే వారికి

ధనపుటాశను కూడా ఆయన చూపించాడు. సాధుసంతులు కనుక రామమందిర నిర్మాణంకోసం విశ్వహిందూ పరిషత్‌తో సంబంధం లేకుండా వేరొక సమితిని ఏర్పాటు చేసేటట్లైతే ప్రభుత్వంద్వారా 100 కోట్ల రూపాయిల నిధిని మంజూరు చేయిస్తానని ప్రలోభాలు చూపాడు. మృతప్రాయంగా మిగిలిన అఖిల భారత సాధు సమాజ్‌కు తిరిగి ప్రాణప్రతిష్ఠ చేసి 'మందిర నిర్మాణ భారం తమకే అప్పగించా' లంటూ వారిచేత తీర్మానం చేయించాడు.

అయితే ఈ కుట్రలేవీ సాధుసంతులను కదిలించలేకపోయాయి. చంద్రస్వామి అనుచరులు హరిద్వార్‌లో తలపెట్టిన సాధుసంతుల సమావేశానికి కేవలం 4గురు బైరాగులు మాత్రమే హాజరయ్యారు. సాధుసంతులంతా విశ్వహిందూ పరిషత్ పక్షాన దృఢంగా నిలిచారు.

చంద్రస్వామి ప్రయోగం విఫలమైనా ప్రధాని తన ప్రయత్నాలను విరమించలేదు. చాతుర్మాస్య దీక్షార్థం వెళ్తున్న పెజావర్ పీఠాధిపతి శ్రీ విశ్వేశ్వర తీర్థుల వారిని పిలిచి దేవాలయాన్ని వేరే స్థలంలో కట్టించవలసిందిగా సాధుసంతులకు నచ్చజెప్పమని కోరారు. అందుకు స్వామీజీ నిరాకరించడంతో సాధుసంతులు బిజెపి చేతిలో కీలు బొమ్మలయ్యారనే అర్థం వచ్చేటట్లుగా అవమానకరంగా మాట్లాడారు. ఈ వ్యాఖ్యకు ఆగ్రహించిన పెజావర్ పీఠాధీశులు తాము బిజెపి చేతిలో కీలుబొమ్మలం ఎంతమాత్రం కాలేదని, వాస్తవానికి తామే ఈ కార్యంలో బిజెపికి ఆశీస్సులనందించామని స్పష్టం చేశారు.

కంచి కామకోటి పీఠాధీశులు స్వామి జయేంద్ర సరస్వతి వద్దకు మాజీ రాష్ట్రపతి శ్రీ ఆర్. వెంకటరామన్ రాయబారం నడిపారు. మూడు గుమ్మటాలలో రెండింటిని హిందు వులకిచ్చేటట్లు, మూడవది ముస్లింలకు ఇచ్చేటట్లు ప్రతిపాదన తెచ్చారు. అయితే మందిర నిర్మాణంలో విశ్వహిందూ పరిషత్‌ను భాగస్వామిని చేయరాదని మెలిక పెట్టారు. ఆ ప్రతిపాదనను కూడా సాధుసంతులు అంగీకరించలేదు.

రామజన్మభూమి ఆలయానికి నమూనాను రచించి ఇచ్చిన ఆలయ శిల్పి శ్రీ సోంపు రాను పిలిపించి ప్రధాని వ్యక్తిగతంగా మాట్లాడారు. వివాదిత కట్టడాన్ని తాకకుండా ఆలయం నిర్మించడానికి మరొక నమూనాను రూపొందించి ఇవ్వవలసిందని ప్రధాని ఆయనను కోరారు. అది సాధ్యమయ్యే పనికాదని శ్రీ సోంపురా స్పష్టం చేశారు.

ప్రధాని అనుసరిస్తున్న ఈ వైఖరికి సాధుసంతులు విసుగు చెందారు. తాము మసీదుగా భావించే ఆ కట్టడాన్ని వేరొక చోటికి తరలించుకొమ్మని ముస్లిం నేత లకు ఒక్కమాట చెప్పలేని ఈ ప్రధానమంత్రి హిందూ నాయకులు, సాధుసంతులపట్ల కుట్రపూరిత ధోరణిలో వ్యవహరించడం వారికి ఆగ్రహం కలిగించింది.

తన ఏడాది పాలనలో ప్రధానమంత్రి మతమౌఢ్య ముస్లిం నాయకత్వానికి దాసోహమనే అనేక చర్యలకు పాల్పడ్డారు. మైనారిటీ కమీషన్‌కు రాజ్యాంగ ప్రతిపత్తిని కల్పించారు. ప్రార్థనా స్థలాల బిల్లును ప్రవేశపెట్టారు. ఉర్దూ వార్తలను ప్రసారం చేయడం ప్రారంభించారు. ఈ చర్యలు వేటిలోను హిందూ సమాజపు ప్రతిక్రియను ఆయన పరిగణనలోకి తీసుకోలేదు. కాగా హిందూ సమాజపు ఏకైక ఆకాంక్ష అయిన రామమందిరం విషయంలో కూడా ప్రధానమంత్రి ముస్లిం మత మౌఢ్య నాయకుల ముందు మోకరిల్లడం సాధుసంతులకు ఆవేదన కలిగించింది.

సాధుసంతుల ఆగ్రహం అక్టోబర్ 30,31 తేదీలలో ఢిల్లీలో జరిగిన ధర్మసంసద్ సమావేశాలలో స్పష్టంగా ప్రకటీకృతం అయింది. ప్రధానమంత్రి తమపట్ల మోసంతోను, అవమానకరంగాను వ్యవహరించారని దాదాపుగా ధర్మసంసద్‌లో ప్రసంగించిన సాధుసంతులంతా అభిప్రాయపడ్డారు. ఈ పరిస్థితులలో కరసేవను పునరుద్ధరించడం మినహా మరొక గత్యంతరం లేదనే నిర్ణయానికి ధర్మసంసద్ వచ్చింది.

ఆ నిర్ణయ ఫలితమే డిసెంబర్ 6వ తేదీన కరసేవను పునరుద్ధరించనున్నట్లు వెలువడిన ప్రకటన.

## బాధ్యతాయుత ప్రతిస్పందన

ఒకప్రక్క ప్రధానమంత్రి కవ్వింపు చర్యలకు పాల్పడుతున్నప్పటికీ సాధుసంతులు తమ హుందాతనాన్ని విడనాడలేదు. కనుకనే అక్టోబర్ మాసాంతంలో జరిగిన ధర్మసంసద్‌లో ప్రధానమంత్రికి మరొకమాసం గడువు ఇచ్చే విధంగా నిర్ణయించారు. కరసేవను డిసెంబర్ 6వ తేదీన తిరిగి ప్రారంభించాలని తీర్మానించారు.

నిజానికి ప్రధానికి ఇది చక్కని అవకాశం. ఆ నెలరోజుల వ్యవధినైనా సక్రమంగా ఆయన వినియోగించుకుని ఉంటే సమస్య మరో విధమైన మలుపు తిరిగి ఉండేది.

తాముకేవలం 2.77 ఎకరాల శిలాన్యాస స్థలంలో మాత్రమే కరసేవను నిర్వహిస్తామని, వివాదిత కట్టడాన్ని ఎట్టి పరిస్థితులలోనూ ఈ దశలో తాకబోమని ధర్మసంసద్ స్పష్టంగా ప్రకటించింది. అయితే 2.77 ఎకరాల స్థలంలో కరసేవను తిరిగి ప్రారంభం చేసేందుకు అనువుగా ఆ స్థలం విషయంలో అలహాబాద్ హైకోర్టులో పెండింగ్‌లో ఉన్న కేసుపై త్వరగా తీర్పు వచ్చేటట్లు చూడమని కూడా ధర్మసంసద్ కేంద్ర ప్రభుత్వాన్ని కోరింది.

మరోప్రక్క వివాదాస్పద కట్టడానికి సంబంధించి బాబరీమసీదు యాక్షన్ కమిటీతో జరుగుతున్న చర్చలను యధాతథంగా కొనసాగించాలని కూడా ధర్మాచార్యులు విశ్వహిందూ పరిషత్‌ను ఆదేశించారు.

శ్రీ చంద్రశేఖర్ ప్రధానమంత్రిగా ఉన్న సమయంలో ఆయన చొరవతో విశ్వహిందూ పరిషత్, బాబరీ మసీదు యాక్షన్ కమిటీల మధ్య చర్చలు ప్రారంభమయ్యాయి. అప్పటి మాజీ ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీ సలహామేరకు శ్రీ చంద్రశేఖర్ వివాదాస్పద కట్టడం దేవాలయాన్ని కూల్చి నిర్మించినదా? అన్న ఏకైక అంశంపైననే చర్చలను కేంద్రీకృతం చేశారు. ఇరుపక్షాలు ఈ విషయంలో తమతమ వాదనలను లిఖితపూర్వకంగా సమర్పించాయి.

విశ్వహిందూ పరిషత్ తాను సమర్పించిన ఆధారాలలో ముస్లిం చరిత్రకారుల కథనాలతోసహా అసంఖ్యాక ఇతర ఋజువులను అక్కడ పూర్వం ఒక దేవాలయం ఉండేదన్న తన వాదనకు సమర్థనగా ప్రతిపాదించింది. పరిషత్ ప్రతిపాదించిన తిరుగులేని ఆధారాలు చూసి బాబరీ నేతలు ఖంగుతిన్నారు. చర్చలు ఇలాగే కొనసాగినట్లైతే తమ వాదం మరింత బలహీనం అవుతుందన్న భయంతో చర్చలను వాయిదా వేయాలని కోరారు. పరిషత్ సమర్పించిన ఆధారాలను సమగ్రంగా పరిశీలించటానికి తమకు 6 నెలల సమయం కావాలని వారు వాదించారు. ఆ విధంగా బాబరీ నేతల కారణంగా చర్చలు గత ఫిబ్రవరిలో అర్ధాంతరంగా నిలిచిపోయాయి.

కాగా శ్రీ పి.వి. అధికారంలోకి వచ్చిన తదుపరి తిరిగి ఈ చర్చలు ప్రారంభమయ్యాయి. అయితే చర్చలలో గతంలో మాదిరిగా చిత్తశుద్ధి కొరవడింది. సవాళ్ళు, ప్రతి సవాళ్ళకు నిలయంగా మాత్రమే అవి మారాయి. తమనుతాము 'నిష్పక్ష చరిత్రకారులు'గా కితాబులిచ్చుకునే వామపక్ష మేధావులు బాబరీ కమిటీ తరఫున రంగంలోకి దిగారు. విశ్వహిందూ పరిషత్ అయోధ్యలో దేవాలయం ఉండేదన్న విషయాన్ని నిర్ధారిస్తూ ప్రతిపాదించిన ఆధారాలన్నింటినీ కేంద్ర ప్రభుత్వం ఈ 'నిష్పక్ష చరిత్రకారులకు' అప్పజెప్పసాగింది. ఈలోగా ప్రధాని రాజకీయ కార్యదర్శి శ్రీ జితేంద్రప్రసాద్ రంగప్రవేశం చేసి విశ్వహిందూ పరిషత్ చూపుతున్న ఆధారాలు అక్కడ ఒక ఆలయం ఉండేదన్న విషయాన్ని ధృవపరచడం లేదని, మరిన్ని ఆధారాలు కావాలని బాబరీ నేతల చేత డిమాండు చేయించసాగాడు. ప్రధాన లక్ష్యం ఈ చర్చలు ఒక కొలిక్కి రాకుండా చేయడమే.

అయినప్పటికీ విశ్వహిందూ పరిషత్ చర్చలలో పాల్గొనడానికే సిద్ధపడింది. బాబరీ నేతలు కోరిన మేరకు సరిక్రొత్త చారిత్రక ఆధారాలతోబాటు పూర్వం అక్కడ ఒక దేవాలయం ఉండేదన్న విషయాన్ని స్పష్టంగా నిర్ధారిస్తూ బయల్పడ్డ పురాతత్వ ఆధారాలను కూడా అది ప్రదర్శించింది. అయినా బాబరీ నేతలకు సంతృప్తి కలుగలేదు.

ఏదో ఒక విధంగా ఈసారికూడా ఈ చర్చల వలయంలోనుండి బైటపడాలని బాబరీ నేతలు ప్రయత్నాలు ప్రారంభం చేశారు. ధర్మసంసద్ కరసేవకు తేదీని నిర్ణయించడం

వారికి చక్కని అవకాశం అయింది. ' అదిగో! పరిషత్ కరసేవను పునరుద్ధరిస్తున్నట్లు ప్రకటించింది కనుక మేం ఇంక చర్చలు సాగించబోం' అని వాళ్లు భీష్మించారు.

నిజానికి చర్చలు సాగుతున్నది వివాదాస్పద కట్టడపు పూర్వచరిత్ర గురించి. అక్కడ పూర్వం ఒక దేవాలయం ఉండేదా? లేదా? అన్న విషయమే చర్చలలో ప్రధానాంశం. కరసేవ జరుపతలపెట్టిన 2.77 ఎకరాల శిలాన్యాస స్థలానికి, చర్చలకు ఏ మాత్రం సంబంధం లేదు. అయినా ఏదో ఒక వంకతో చర్చలను సాగనీయకుండా చేయాలని నిశ్చయంతో ఉన్న బాబరీ నేతలు ఈ అంశాన్నే అందుకు అనువుగా వాడుకోవాలని అలోచించారు. తామింక చర్చలకు రాబోవడం లేదని ప్రకటించారు.

బాబరీ నేతలు చర్చలను అర్థాంతరంగా నిలిపివేయడం తప్పు అని చెప్పే సాహసం కూడా ప్రధానమంత్రికి లేకపోయింది. పైగా విశ్వహిందూ పరిషత్ తొందరపడి కరసేవ తేదీని నిర్ణయించిందని, దాదాపు ఫలవంతం కానున్న చర్చలను దెబ్బతీసేందుకే కరసేవ తేదీలను ప్రకటించారని ఆయన పదేపదే ఆరోపించారు.

బాబరీ నేతలు, కేంద్ర ప్రభుత్వాల ఈ వైఖరిని పరిషత్ నిరసించింది. వివాదాస్పద కట్టడం దేవాలయాన్ని కూల్చి నిర్మించినదే అన్నది ఒక్కటే చర్చలకు కేంద్రబిందువని, డిసెంబర్ 6న తలపెట్టిన కరసేవకు, చర్చలకు ఏమాత్రం సంబంధం లేదని పరిషత్ వివరించింది. వివాదాస్పద కట్టడం విషయంలో చర్చలకు తాము ఇప్పటికీ సిద్ధంగానే ఉన్నామని పరిషత్ నాయకులు ప్రకటించారు కూడా.

అయితే బాబరీ కమిటీ నేతల మొండివైఖరి కారణంగా మరల చర్చలలో ప్రతిష్ఠంభన ఏర్పడింది.

మొత్తంమీద నవంబర్ మాసం ప్రారంభం అయ్యేనాటికి దాదాపుగా పరిస్థితి ఈ విధంగా ఉంది. ప్రభుత్వానికి మరొక నెలకుపైగా సమయం లభించింది. ఉత్తర ప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం స్వాధీనం చేసుకున్న 2.77 ఎకరాల స్థలంలోనే కరసేవను కొనసాగించాలని, వివాదిత కట్టడాన్ని తాకరాదని పరిషత్ నిర్ణయించింది.

## సంఘర్షణకే ప్రధాని సంకేతం

ఈ పరిస్థితులలో ప్రధానమంత్రి నిశితమైన ఆలోచనతో రెండుమూడు చర్యలు తీసుకుని ఉంటే సమస్య సామరస్య పూర్వకంగా పరిష్కారం అయ్యేందుకు మార్గం లభించేది. కానీ దురదృష్టవశాత్తు అది జరగలేదు. సంఘర్షణకే ప్రధాని సిద్ధపడ్డారు.

2.77 ఎకరాల భూమిపై అలహాబాద్ హైకోర్టులో పెండింగ్‌లో ఉన్న తీర్పును త్వరగా వచ్చేటట్లు చేసినట్లైతే సంఘర్షణ నివారింపబడి ఉండేది. కానీ ప్రధాని అలాంటి ప్రయత్నం చేసేందుకు నిరాకరించారు. పైగా కరసేవను నిరోధించేందుకు చివరిక్షణంవ

రకు ప్రయత్నాలు సాగించారు.

కరసేవను వాయిదా వేయించాలని వివిధ పద్ధతులలో ఒత్తిడులు తెచ్చారు. ఈప్రయత్నాలలో ప్రధానికి ఆయన మంత్రివర్గ సహచరులైన శ్రీ శరద్‌పవార్, శ్రీ ఆర్.కుమార మంగళంలు సహకరించారు. ముఖ్యంగా శ్రీ శరద్‌పవార్ సంఘ పరివార్‌కు చెందిన ప్రముఖుల వెంటపడగా శ్రీ కుమార మంగళం సాధుసంతులను ఒప్పించే కృషిని ప్రారంభించారు. ఇదే సమయంలో ముస్లిం నాయకత్వంతో సంబంధాలు కొనసాగించే భారాన్ని శ్రీ సుబోధ్ కాంత్ సహాయ్ తన నెత్తిన వేసుకున్నారు.

కరసేవను వాయిదా వేయించేందుకు సాధుసంతులను ఒప్పించాలంటూ శ్రీ శరద్‌పవార్ సంఘ పరివార్‌కు చెందిన శ్రీ రజ్జాభయ్యా తదితరులపై ఒత్తిడి తెచ్చారు. అయితే వారు అందుకు నిర్ద్వందంగా తిరస్కరించారు. ఇక సంత్ వామదేవ్‌జీ తదితర సాధుసంతులైతే కేంద్ర ప్రభుత్వ వైఖరిపట్ల ఎంత ఆగ్రహంతో ఉన్నారంటే ప్రధాని పంపిన దూతలను వ్యక్తిగతంగా కలుసుకునేందుకుసైతం వారు తిరస్కరించారు. ఏదైనా చర్చించదలిస్తే మొత్తం మార్గదర్శక మండలి సభ్యులందరితోనూ కలిసి చర్చించాలి తప్ప విడివిడిగా తమను కలిసే అవసరం ఎంతమాత్రం లేదని వారు ప్రధాని దూతలకు స్పష్టం చేశారు.

డిసెంబర్ 6 వ తేదీ కరసేవ విషయంలో సాధుసంతులు దృఢ సంకల్పంతో ఉండడాన్ని గమనించిన ప్రధానమంత్రి కరసేవకుల ఆత్మ స్థైర్యాన్ని దెబ్బతీసే ఎత్తుగడలకు పాల్పడ్డారు. ఈ ఎత్తుగడలలో భాగమే జాతీయ సమగ్రతా మండలి సమావేశం ఏర్పాటు.

## సమగ్రతా మండలి హిందూ వ్యతిరేక శక్తుల కూటమి మాత్రమే

డిసెంబర్ 1వ తేదీన ప్రధానమంత్రి జాతీయ సమగ్రతా మండలి సమావేశాన్ని ఏర్పాటు చేశారు. అయోధ్య సమస్యపై పదేపదే జాతీయ సమగ్రతా మండలి సమావేశాలనేర్పాటు చేయడం తగదని నిరసిస్తూ బిజెపి ఆ సమావేశాన్ని బహిష్కరించింది. మరోప్రక్క మండలిలో ఏకైక విశ్వహిందూ పరిషత్ సభ్యుడైన శ్రీ విష్ణు హరిదాల్మియాకూడా సమావేశంలో పాల్గొనరాదనే నిర్ణయించారు.

యధాప్రకారం సమగ్రతా మండలి సమావేశాలు బిజెపి, విశ్వహిందూ పరిషత్‌లపై నిందాస్త్రాల ప్రయోగాలతో గడిచిపోయాయి. సభ్యుడు తరువాత సభ్యుడు రామమందిర ఉద్యమాన్ని నిందించడంలో పోటీలు పడ్డారు. బిజెపిని నిషేధించాలని, యు.పి.రాష్ట్ర ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయాలని వగైరా అనేక సలహాలు కేంద్రానికి అందించబడ్డాయి.

బిజెపి, విశ్వహిందూ పరిషత్‌ల ప్రాతినిధ్యం లేని ఆ సమావేశాలు కుమారి జయల

లిత ప్రమేయం కల్పించుకోకుండా ఉండి ఉంటే హిందూ వ్యతిరేక శక్తుల కూటమి అన్న తమ పేరును సార్థకం చేసుకుని ఉండేవి. కుమారి జయలలిత సమయానికి అడ్డుకున్నారు. శ్రీ పి.వి. ప్రభుత్వాన్ని ఇరకాటంలో పడవేస్తూ చక్కని ప్రసంగాన్ని ఆమె చేశారు.

బిజెపిని ఈ సమావేశాలలో నిందించినంత మాత్రాన సరిపోదని బైట మెజారిటీ ప్రజలు వారి పక్షాన నిలచి ఉన్నారన్న విషయాన్ని విస్మరించ జాలమని ఆమె పేర్కొన్నారు. 2.77 ఎకరాల స్థలంలో కరసేవకు అనుమతి నివ్వాలని, వివాదాస్పద కట్టడం దేవాలయాన్ని కూల్చికట్టినదేనా అన్న విషయాన్ని నిర్ధారించేందుకు సుప్రీం కోర్టుకు ఆధారాలను నివేదించాలని ఆమె చేసిన ప్రతిపాదనలను కేంద్రం పెడచెవిన పెట్టింది. సంఘర్షణ మార్గాన్నే అది ఎంచుకుంది.

## న్యాయ వ్యవస్థ వైఫల్యం

అయోధ్య సమస్య పరిష్కారం విషయంలో న్యాయస్థానాలు కూడా తమ విధులను సక్రమంగా నిర్వర్తించడంలో విఫలం అయ్యాయి. న్యాయస్థానాల వద్ద జరిగిన అంతులేని జాప్యం కరసేవకుల ఆగ్రహాన్ని రెట్టింపు చేయడానికి దోహదపడింది. స్మగ్లర్లకు, నల్ల వ్యాపారులకు బెయిళ్ళు మంజూరు చేయడంకోసం అర్ధరాత్రులు సైతం వాదప్రతివాదాలు కొనసాగించి తీర్పునిచ్చే గౌరవనీయ న్యాయమూర్తులు అయోధ్య విషయంలో మాత్రం అంతులేని తాత్సారం చేశారు.

1949లో అయోధ్య వివాదం స్వతంత్ర భారతంలో తొలిసారిగా న్యాయస్థానాల వద్దకు చేరిననాటినుండి ఈ జాప్యం కొనసాగుతూనే ఉంది. అయోధ్య వివాదాన్ని పరిష్కరించే దిశలో గత40 సంవత్సరాల కాలంలో న్యాయస్థానాలు తగిన విధమైన ప్రతిస్పందనను ఏమాత్రం చూపకపోవడం మన న్యాయ వ్యవస్థ దుస్థితికి తార్కాణం. కాగా పరిస్థితి అగ్నిపర్వతపుటంచుకు చేరుకున్నంతటి ప్రమాదకర స్థాయికి చేరిన సమయంలో కూడా న్యాయస్థానాలు ఆ తాత్సార ధోరణినే కొనసాగించాయి.

డిసెంబర్ 6వ తేదీన కరసేవకు నిర్ణయించిన 2.77 ఎకరాల శిలాన్యాస స్థలాన్ని గతంలో ఉత్తరప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది. ఆ స్వాధీనాన్ని సవాలు చేస్తూ అప్పట్లో రాష్ట్ర హైకోర్టులో ఒక కేసు దాఖలు అయింది.

గత జూలైలో ఆ స్థలంలో కరసేవను పునః ప్రారంభించాలని సాధుసంతులు నిర్ణయించినపుడు హైకోర్టు అందుకు అభ్యంతరం తెలిపింది. ఆ స్థల యాజమాన్యం హైకోర్టుముందు వివాదంగా నిలచి ఉంది కనుక అక్కడ ఏవిధమైన శాశ్వత నిర్మాణ కార్యాన్ని ప్రారంభించరాదని హైకోర్టు రాష్ట్ర ప్రభుత్వాన్ని ఆదేశించింది. హైకోర్టు ఆదేశాలను అమలు చేయవలసిందిగా సుప్రీంకోర్టు కూడా ఆ సమయంలో రాష్ట్ర ప్రభు

త్వంపై ఒత్తిడి తెచ్చింది. రాష్ట్ర ప్రభుత్వం కనుక కరసేవను తాత్కాలికంగా నిరోధించగలిగితే పెండింగ్‌లో ఉన్న వివిధ కేసులను సుప్రీంకోర్టు వద్దకు చేర్చి, వాటిని త్వరగా పరిష్కరించే దిశలో ప్రయత్నాలు సాగిస్తామని కూడా సుప్రీంకోర్టు సూచనప్రాయంగా తెలిపింది.

న్యాయస్థానాల అభ్యర్థనలమేరకు రాష్ట్రప్రభుత్వం అప్పట్లో కరసేవను వేరేస్థలానికి మార్చు చేసేటట్లు సాధుసంతులను ఒప్పించడంలో కృతకృత్యం అయింది. కాగా 2.77 ఎకరాల శిలాన్యాస స్థలం విషయంలో న్యాయస్థానాలు తమ మాట నిలబెట్టుకుంటూ త్వరగా తీర్పునిస్తాయని రాష్ట్ర ప్రభుత్వం ఆశించింది.

శిలాన్యాస స్థలం యాజమాన్యం విషయంలో దాఖలైన కేసులో వాదప్రతివాదాలు నవంబరు 3వ తేదీకి పూర్తయ్యాయి. డిసెంబర్ 6 వ తేదీన కరసేవను తిరిగి ప్రారంభించదలిచామని విశ్వహిందూ పరిషత్ ప్రకటించింది. అంటే ఆ స్థలం విషయంలో తీర్పునిచ్చేందుకు న్యాయస్థానాలకు నెలరోజులకుపైగా సమయం లభించిందన్నమాట.

కరసేవకు నిర్ణయించిన తేదీ దగ్గర పడుతున్నకొద్దీ దేశంలో వాతావరణం ఉద్రిక్తంగా మారుతుండడం గమనించిన రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ కళ్యాణ్ సింగ్ 2.77 ఎకరాల భూమిపై తీర్పును సాధ్యమైనంత త్వరగా ప్రకటించమని హైకోర్టును అభ్యర్థించారు. కోర్టు తీర్పు ఏవిధంగా ఉన్నప్పటికీ ఉద్రిక్తతలను తగ్గించడానికి అది ఎంతగానో దోహద పడగలదని, కనుక ఒక ముఖ్యమంత్రిగా కాక ఒక సాధారణ పౌరుడిగా త్వరగా తీర్పు నివ్వవలసిందిగా హైకోర్టును అర్థిస్తున్నానని కూడా ఆయన వివరించారు.

ముఖ్యమంత్రి అభ్యర్థనకు హైకోర్టు న్యాయమూర్తులు విచిత్రంగాను, అహంకారపూరితంగాను ప్రతిస్పందించారు. సమయాసమయ విచక్షణను గురించి తమకు ఎవరూ బోధించనవసరం లేదని వారు హూంకరించారు. ఎప్పుడు తీర్పు నివ్వాలో తమకు తెలుసునంటూ ముందుగా నిర్ణయించిన డిసెంబరు 4వ తేదీని కాదని కావాలని తీర్పును డిసెంబర్ 7వ తేదీకి, ఆ తదుపరి డిసెంబర్ 11 వ తేదీకి వాయిదా వేశారు.

న్యాయస్థానాల ఈ విచిత్ర చర్యలకు వాటి పక్షపాత వైఖరి మినహా మరేదీ కారణం కావడానికి అవకాశం లేదన్న భావం హిందువులలో ప్రబలింది. స్వయంగా శ్రీ అద్వానీతో సహా పలువురు హిందూ సంస్థల నాయకులు ఈ అభిప్రాయాన్ని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రకటించారు కూడా.

డిసెంబర్ 11 వ తేదీన 2.77 ఎకరాల స్థలంపై అలహాబాద్ హైకోర్టు ఇచ్చిన తీర్పు విన్న తరువాత సాధారణ వ్యక్తికిసైతం ఇదే అభిప్రాయం కలుగడంలో ఆశ్చర్యం ఏమీ ఉండదు. డిసెంబర్ 11 నాటి తీర్పులో హైకోర్టు పేర్కొన్న ఏకైక అంశం 'రాష్ట్ర ప్రభుత్వం ఆ స్థలాన్ని స్వాధీనం చేసుకోవడం చెల్లదు' అన్నది మాత్రమే. ఈ

మాత్రం తీర్పును ఇవ్వడానికి డిసెంబర్ 4 వ తేదీనుండి 11వ తేదీకి ఎందుకు మార్పు చేయవలసి వచ్చిందన్నది ఎవరికీ అంతుబట్టని విషయం.

హైకోర్టు తీర్పు డిసెంబరు 4 వ తేదీనాడే వెలువడి ఉంటే పరిణామాలు మరో విధంగా ఉండి ఉండేవి. రాష్ట్ర ప్రభుత్వం భూమిని స్వాధీనం చేసుకోవడం తగదని కోర్టు తీర్పునిచ్చిన నేపథ్యంలో ప్రభుత్వం ఆ భూమిని డి-నోటిఫై (De-Notify) చేసి ఉండేది. సహజంగానే అప్పుడు ఆ భూమిపై స్వాధీనానికి ముందుగల యాజమానులకే యాజమాన్యం లభించి ఉండేది. రాష్ట్ర ప్రభుత్వ స్వాధీనానికి పూర్వం ఆ 2.77 ఎకరాల భూమిలో అధిక భాగం.. దాదాపు 80 శాతం భూమి.. విశ్వహిందూ పరిషత్ ఆధీనంలో ఉండేది. ఆ భాగంలోనే జూలైలో జరిగిన కరసేవ కూడా కేంద్రీకృతమైంది. కనుక స్వాభావికంగానే స్థల యాజమాన్యం పరిషత్ చేతుల్లోకి వెళ్లేది. అప్పుడు కరసేవకు ఏ విధమైన ఆటంకం ఉండేది కాదు.

సరిగ్గా ఈ కారణం మీదనే న్యాయస్థానాలు తీర్పునివ్వడానికి వెనుకంజ వేశాయన్నది హిందూ నేతల ఆరోపణ. కరసేవ యత్నాలను దెబ్బతీసేందుకుగాను కేంద్ర ప్రభుత్వం న్యాయవ్యవస్థలో కూడా ప్రమేయం కల్పించుకుని తీర్పు సమయానికి రాకుండా ఉండేటట్లు కావాలని ప్రయత్నించిందన్న వారి ఆరోపణలు అసత్యమని కొట్టిపారవేయడానికి అవకాశాలు బహు తక్కువ.

## రెచ్చగొట్టే చర్యలు

కరసేవకు నిర్ధారించిన డిసెంబర్ 6 వ తేదీ సమీపిస్తున్న కొద్దీ కేంద్ర ప్రభుత్వం వ్యవహరించిన తీరు ఉద్రిక్తతలు మరింత పెరగడానికే దోహదం చేసింది. అటువంటి సమయాలలో నిజానికి నిగ్రహం ఎంతో అవసరం. వేల సంఖ్యలో కరసేవకులు అయోధ్యకు తరలివస్తున్న ఆ సమయంలో అవివేకంతో ఆవేశాలను రెచ్చగొట్టే ఏ చర్యకు పాల్పడినా అది ఆత్మహత్యా సదృశమే అవుతుంది. దురదృష్టవశాత్తు ఇటు కేంద్ర ప్రభుత్వం, అటు సుప్రీం కోర్టులు రెండూ ఆత్మహత్యా సదృశ వైఖరినే అవలంబించాయి.

ఉత్తరప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వ అనుమతి లేకుండానే వేల సంఖ్యలో పారా మిలిటరీ దళాలను కేంద్ర ప్రభుత్వం అయోధ్యకు తరలించింది. నవంబర్ 19 వ తేదీన ప్రారంభమైన ఈ తరలింపు ఒకవైపు కరసేవకులు అయోధ్య చేరుకుంటున్నా కొనసాగుతూనే వచ్చింది. దాదాపు 100 కంపెనీలకు పైగా కేంద్ర ప్రభుత్వ సాయుధ బలగాలు అయోధ్యకు తరలింపబడ్డాయి. 11 వేలమంది అధునాతన ఆయుధధారులైన సైనికులతో అయోధ్య యుద్ధ భూమిగా మారింది. ఫలితంగా ఉద్రిక్తతలు మరింత పెరిగాయి.

తమ అనుమతి లేకుండా కేంద్ర బలగాలను అయోధ్యకు తరలించడంపట్ల ముఖ్య

మంత్రి శ్రీ కళ్యాణ్ సింగ్ నిరసన ప్రకటించారు. అయోధ్యలో కేంద్ర భద్రతాదళాలు ప్రవేశించినట్లైతే కరసేవకులలో ఉద్రిక్తతలు పెరగడానికి అది కారణమవుతుందని, శాంతి భద్రతలకు దానివల్ల భంగం కలిగే ప్రమాదం ఉందని శ్రీ కళ్యాణ్ సింగ్ చేసిన హెచ్చరికను కేంద్ర హోం మంత్రి శ్రీ ఎస్. బి.చవాన్ త్రోసిపుచ్చారు. దేశంలో ఏ ప్రాంతంలోకైనా కేంద్రబలగాలను తరలించే అధికారం కేంద్ర ప్రభుత్వానికి ఉన్నదని ఆయన ప్రకటించారు.

ఆశ్చర్యమేమిటంటే ఇదే హోంమంత్రివర్యులు గత జూన్‌లో అదే రాష్ట్ర ముఖ్య మంత్రి కేంద్ర బలగాలు కావాలని అర్థిస్తే అవి అందుబాటులో లేవని తన అశక్తతను ప్రదర్శించారు. అప్పట్లో ఉత్తరప్రదేశ్‌లోని తెరాయ్ కొండల ప్రాంతంలో ఖలిస్తాన్ తీవ్రవాదుల ఆగడాలు మితిమీరిపోయాయి. ఆ తీవ్రవాద శక్తులను అణచడానికిగాను శ్రీ కళ్యాణ్ సింగ్ 40 కంపెనీల కేంద్ర పారామిలిటరీ బలగాలను పంపించవల సిందని హోం మంత్రిని కోరితే ఆయన మొండి చెయ్యి చూపారు. అదే హోం మంత్రి 4 నెలలు తిరగకుండానే ముఖ్యమంత్రి వద్దంటున్నా వినకుండా 110 కంపెనీల పారామిలటరీదళాలను తరలించడం విడ్డూరం కాదూ!

ఇలాంటి విడ్డూరాలు మన కుహనా సెక్యులర్ భారతంలో సర్వసహజం . తీవ్రవా దపు ఉక్కు పిడికిలి నుండి వేలాది అమాయక ప్రజల ప్రాణాలను కాపాడడం కంటే శిధిలావస్థలో ఉన్న ఒక కట్టడాన్ని కాపాడడమే మన నాయకులకు ప్రధానం. ఎందుకంటే బాబరీ శిధిలాలలో వారు కాపాడదలచుకున్నది నెహ్రూ బ్రాండు సెక్యులరిజాన్ని కాబట్టి.

## సుప్రీం కోర్టు వైఖరి

అయోధ్య వివాదపు చివరిదశలో సుప్రీం కోర్టు వైఖరిని గురించి కూడా ప్రత్యేకంగా పేర్కొనాలి. 2.77 ఎకరాల భూమిపై అలహాబాద్ హైకోర్టులో సాగుతున్న విచారణను త్వరితం చేసి, తీర్పు త్వరగా వచ్చేటట్లు చూడమని ప్రజాప్రయోజనాల దృష్ట్యా రాష్ట్ర ప్రభుత్వం కోరితే సుప్రీంకోర్టు హైకోర్టుకు ఆ విధంగా ఆదేశాలివ్వడానికి నిరాకరిం చింది. అదే సుప్రీం కోర్టు కేంద్ర ప్రభుత్వం కోరగానే రాష్ట్ర ప్రభుత్వానికి రోజుకొక తాఖీదు పంపడానికి ఉద్యుక్తం అయింది.

కరసేవ ఎట్టి పరిస్థితులలోనూ జరగకుండా చూడాలని కోర్టు నవంబర్ 24న రాష్ట్ర ప్రభుత్వాన్ని ఆదేశించింది. సాధు సంతులను అందుకు ఒప్పించడానికి రాష్ట్ర ప్రభుత్వం వారంరోజుల గడువుకోరితే లేదు పొమ్మంది. తన ఆదేశాలు తప్పక అమలు జరుగుతాయని రెండురోజుల్లోగా హామీ ఇవ్వాలని రాష్ట్ర ప్రభుత్వాన్ని ఆదేశించింది. నవంబర్ 27నాడు రాష్ట్ర ప్రభుత్వం అందుకు ఆశాభావం వ్యక్తం చేస్తూ అఫిడవిట్ దాఖలు చేసింది.

అయితే అఫిడవిట్ చాలదని, మరునాటికల్లా స్పష్టమైన లిఖిత పూర్వక హామీ ఇవ్వాలని కోర్టు పట్టుబట్టింది. మరునాడు రాష్ట్ర ప్రభుత్వం ఆ మేరకు స్పష్టమైన హామీని సమర్పించింది. అంతటితో కోర్టు మిన్నకుండవలసింది. కానీ అలా జరుగలేదు.

సుప్రీంకోర్టు న్యాయమూర్తులు తమ పరిధులను మించి ఉత్సాహాన్ని ప్రదర్శించారు. కరసేవ సందర్భంగా కేవలం భజనలు, పూజలు మాత్రమే జరుగుతాయని, ఎటువంటి నిర్మాణము జరగదని ప్రచారం సాగించాలని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ఆదేశాలిచ్చారు. అదే సమయంలో మొరాదాబాద్ జిల్లా జడ్జి శ్రీ తేజశంకర్‌ను అయోధ్యలో పరిశీలకునిగా కోర్టు నియమించింది. అయోధ్యలో పరిస్థితులు ఏమాత్రం విషమించినట్లు శ్రీ తేజశంకర్ నివేదికను ఇచ్చినా వెంటనే సుప్రీంకోర్టు వెంటనే చర్యలు తీసుకుంటుందని వివాదిత స్థలాన్ని స్వాధీనం చేసుకోవలసిందిగా కేంద్ర ప్రభుత్వాన్ని ఆదేశించడంగానీ, కోర్టే స్వయంగా స్వాధీనం చేసుకుని రిసీవర్‌ను నియమించడంగానీ చేస్తుందని న్యాయమూర్తులు హెచ్చరించారు.

అవసరానికి మించిన ఉత్సాహాన్ని ప్రదర్శించిన సుప్రీంకోర్టు కరసేవకుల హృదయాలలో ఏక్షణంలోనైనా రాష్ట్ర ప్రభుత్వం బర్తరఫ్ కావచ్చునన్న ఆందోళనను కలిగించింది.

కేంద్ర ప్రభుత్వం, సుప్రీంకోర్టు, హైకోర్టులు కలిసి తమ ఉద్యమానికి వ్యతిరేకంగా కుట్ర పన్నుతున్నాయన్న భావన కరసేవకులలో ప్రబలంగా కలిగింది. రాపిడ్ యాక్షన్ ఫోర్స్‌తో సహా పెద్ద సంఖ్యలో కేంద్ర బలగాలను కేంద్రం అయోధ్య చుట్టూ మొహరించడం, హైకోర్టు తీర్పును 11వ తేదీకి వాయిదా వేయడం, సుప్రీంకోర్టు అయోధ్య పరిణామాలపై క్షణక్షణం నివేదికలు పంపడానికి శ్రీ తేజశంకర్‌ను ప్రత్యేక అధికారిగా అయోధ్యలో నియమించడం వంటి చర్యలు కరసేవకులను ఉద్రిక్తులను చేశాయి.

ఆ ఉద్రిక్త భావాలు డిసెంబర్ 6 నాటి సంఘటనలలో ఆవిష్కృతం అయ్యాయి.

## ఉద్రేకం కట్టలు తెగినవేళ

అయోధ్యలోని వివాదాస్పద కట్టడంపైన డిసెంబర్ 6వ తేదీన ఆ అయిదుగంటలు కరసేవకులు సాగించిన ఆక్రమణ అనిర్వచనీయం. కుహనా లౌకికవాదానికి సాక్షాత్కారంగా నిలచి ఉన్న ఆ బాబరీ కట్టడం పట్ల ఏండ్ల తరబడి గుండెల్లో పేరుకుపోయిన ద్వేషం ఒక్కసారి వెల్లువైన ఆ క్షణాన కరసేవకుల వీరావేశం చూసి తీరవలసిందే తప్ప వర్ణించదగినది కాదు.

పాపానికి ప్రతిరూపమైన ఆ కట్టడంపైన కేవలం పిడికిళ్ళతో దాడిచేసి, ఆ ఉక్కులాంటి దృఢమైన కట్టడంపై పిడిగుద్దులు గుద్దుతూ చేతులలో రక్తాలు కారుతున్నా లెక్కచేయక 'జైశ్రీరాం' అంటూ గర్జిస్తున్న యువకిశోరాల ఆవేశాన్నేమని వర్ణించాలి!

ఒకసారి చేతికి ఏ పలుగో, పారో దొరికితే ఇకదాన్ని వదలకుండా గంటల తరబడి ఆ కట్టడంపై దాడిసాగించిన శాంతిప్రియులైన సాధుసంతుల సమరావేశాన్నేమని వర్ణించాలి! గుమ్మటం కుప్పకూలుతుంటే తోటివారి హెచ్చరికలనేమాత్రం ఖాతరు చేయక దానిపైన కాషాయజెండాతో నిలబడి 'జైశ్రీరాం' అంటూ శిధిలాలలో కలిసిపోయిన నూనూగు మీసాల నవయువకుని బలిదాన ఆవేశాన్ని ఏవిధంగా ప్రస్తుతించాలి!

అది ఒక అద్భుత కాలఖండం. జాతి చరిత్రలో అతి అరుదైన కాలఖండం అది.

## అపశృతులు

అవధులులేని ఉత్సాహంలో అక్కడక్కడ అపశృతులు దొర్లడం అతి స్వాభావికం. పత్రికా ప్రతినిధులపై జరిగిన దాడి అటువంటిదే. పత్రికలు ప్రజాస్వామ్యానికి పట్టుకొమ్మలు. పత్రికా స్వాతంత్ర్యం పరిరక్షింపబడడం ప్రజాస్వామ్యవ్యవస్థ ప్రధాన కర్తవ్యాలలో ఒకటి. కనుక అయోధ్యలో కొందరు కరసేవకులు కొందరు పత్రికా ప్రతినిధులతో అభ్యంతరకరమైన తీరులో వ్యవహరించడం సమర్ధనీయం ఎంతమాత్రం కాదు.

అయితే నాణేనికి మరోవైపు కూడా ఉంటుంది. 40 సంవత్సరాల స్వాతంత్ర్య జీవనంలో సాక్షాత్తు న్యాయవ్యవస్థతో సహా వివిధ వ్యవస్థలలో పతనం ప్రారంభమైంది. పత్రికా రంగం కూడా అందుకు మినహాయింపు ఎంతమాత్రం కాదు.

ముఖ్యంగా అయోధ్యలో కొందరు పత్రికా ప్రతినిధులపై జరిగిన దాడులకు, ఈ పతనానికి దగ్గర సంబంధం ఉంది. పత్రికలు రామజన్మభూమి ఉద్యమాన్ని శక్తిమేరకు వక్రీకరించి వ్రాస్తున్నాయన్న భావం కరసేవకులలో నిర్మాణం అయింది. కరసేవకు కొద్దిరోజులముందునుండి పత్రికలు వ్రాస్తున్న వార్తల తీరు ఈ భావాన్ని మరింత ప్రబలం చేసింది.

ఉదాహరణకు బిబిసి డిసెంబర్ 4వ తేదీనాడు అయోధ్యలో కరసేవకులపై లాఠీ ఛార్జి జరిగినట్లు అసత్య ప్రచారం చేసింది. మరో విదేశీ పత్రిక వీడియో బృందం గాలిలోకి బిస్కెట్లు విసిరి, కరసేవకులు వాటిని అందుకుంటూంటే చిత్రీకరించి, కరసేవకులకు నిర్వాహకులు సరిగ్గా భోజనం కూడా పెట్టడం లేదని ప్రచారం చేశారు. ఇలాంటి సంఘటనలన్నీ కరసేవకులలో పత్రికా విలేఖరుల పట్ల... ముఖ్యంగా ఫొటోగ్రాఫర్లపట్ల, వారు తీసే ఫొటోల పట్ల అపనమ్మకం, అభ్యంతరం ఏర్పడడానికి కారణమయ్యాయి. దాని ఫలితమే వారిలో కొద్దిమందిపై జరిగిన దాడులు.

కాగా హిందూ సంస్థలను వాటి కార్యకలాపాలను ఏదో ఒక విధంగా అప్రదిష్ట పాలుచేయడమే తమ లక్ష్యంగా పెట్టుకున్న పత్రికారంగంలోని వామపక్ష ప్రతినిధులు ఈ జరిగిన సంఘటనలను గోరంతలు కొండంతలు చేసి ప్రచారం సాగించారు. కేంద్ర

ప్రభుత్వం కూడా వత్తాసు పలకడంతో వారు మరింత విజృంభించి ఊరేగింపులు, ధర్నాలు వగైరాలు సాగించారు.

## ప్రచారసాధనాల దుర్వినియోగం

ఏమైతేనేం! వివాదాస్పద కట్టడం నేలకూలింది. ఆ నేలకూలడం అనే సంఘటన అందించే సందేశాన్ని మన నాయకత్వం అందుకుని ఉండవలసింది. కానీ దురదృష్ట వశాత్తు అలా జరగలేదు. అయోధ్యలో కూలినది వివాదాస్పద కట్టడం మాత్రమేనన్న సత్యాన్ని దేశానికి, ప్రపంచానికి అందించగలిగి ఉంటే తదుపరి సంభవించిన దుష్పరిణా మాలను నిరోధించగలిగి ఉండేవారు. కానీ నాయకులే అసత్య ప్రచారానికి పాల్పడ్డారు. మసీదు కూలిపోయిందంటూ పెద్ద ఎత్తున ప్రచారం సాగించారు.

డిసెంబర్ 6వ తేదీ సాయంత్రానికి దాదాపుగా దేశమంతటికీ అయోధ్యలో జరిగిన సంఘటన తెలిసిపోయింది. స్టార్ టి.వి. పుణ్యమా అని బిబిసి ద్వారా దేశప్రజలు జరిగిన సంఘటనను త్వరగానే తెలుసుకోగలిగారు.

మన దూరదర్శన్ కూడా రాత్రి 8.40గం.ల వార్తలలో అయోధ్యలో మూడు గోపురాలను కరసేవకులు కుప్పకూల్చినట్లు ప్రకటించింది. అయితే మతపరంగా సదా ఉద్రిక్తంగా ఉండే హైదరాబాద్‌లాంటి నగరంతో సహా దేశంలో ఎక్కడా ఆ రాత్రి ఎటు వంటి అల్లర్లు సంభవించలేదు. సాధారణ ముస్లిం సమాజం ఆ సంఘటనకు పెద్దగా ప్రతిక్రియ చూపలేదు.

ఈ వాస్తవాన్ని దృష్టిలో ఉంచుకుని ప్రభుత్వం కొద్దిగా సంయమనంతో వ్యవహరించి ఉంటే తదుపరి సంభవించిన మారణహోమాన్ని చాలావరకు తగ్గించడానికి ఆస్కారం ఏర్పడి ఉండేది. అయోధ్య సంఘటనకు అనవసర ప్రాధాన్యత నియ్యకుండా జాగ్రత్తపడి ఉంటే సరిపోయేది. ప్రభుత్వ ప్రచార సాధనాలకు అందుకు తగిన నిర్దేశాలిచ్చి ఉంటే బాగుండేది. వార్తా పత్రికలకు కూడా అదే విధమైన నిర్దేశాలు అందజేయగలిగి ఉండడానికి ప్రభుత్వానికి కావలసినంత సమయం కూడా లభించింది.

ఇవన్నీ చేయడం ప్రభుత్వానికి అసాధ్యం ఎంతమాత్రం కాదు. ఎందుకంటే 1990లో తొలిసారి కరసేవ దిగ్విజయంగా పూర్తయినపుడు ఆ సంఘటనలను సాధ్యమైనంత తక్కువ ప్రచారం చేయడానికి ప్రభుత్వము, దాని ప్రచార సాధనాలు సాగించిన కుటిల ప్రయత్నాలు ప్రజలకు తెలియనివికావు. అసలు దూరదర్శన్‌పైన, ప్రభుత్వ ప్రచార సాధనాల పైన ప్రజలు విశ్వాసం పూర్తిగా కోల్పోయినదీ, బిబిసి వంటి విదేశీ వార్తా సంస్థలకు దేశంలో ప్రాధాన్యత పెరిగినదీ ఆ సంఘటనల తరువాతే. బిజెపి అధ్యక్షులు డా. మురళీమనోహర్ జోషీ శ్రీనగర్‌కు సాగించిన సమైక్యతా యాత్రను, కోట్లాది

దేశభక్త హృదయాలను పులకితం చేస్తూ వేర్పాటువాదుల గుండెలపైన శ్రీనగర్‌లో ఆయన జాతీయ త్రివర్ణాన్ని ఎగురవేయటాన్ని మన ప్రభుత్వ ప్రచార సాధనాలు ఉద్దేశపూర్వకంగా ఉపేక్షించాయి. అలాంటిది మొన్నటి అయోధ్య సంఘటనలకు మాత్రం అంతులేని ప్రాధాన్యత కల్పించటం చూస్తే ప్రభుత్వపు వక్రబుద్ధి అర్థం అవుతుంది. తమ వోటుబ్యాంకు రాజకీయాలకు అనుకూలంగా ఉండే విధంగా ప్రచార సాధనాలను దుర్వినియోగం చేయడం అనేది కాంగ్రెస్‌వారికి వెన్నతో పెట్టిన విద్య. ఆ విద్యనే అయోధ్య సంఘటనల నేపథ్యంలో ప్రధాని శ్రీ పి. వి. నరసింహారావు, ఆయన అనుచర వర్గం ప్రదర్శించాయి.

దేశమంతా ప్రశాంతంగా ఉన్న డిసెంబర్ 6వ తేదీ రాత్రి హిందీవార్తల అనంతరం పనిగట్టుకుని ప్రధానమంత్రి తన ఆంగ్లం, హిందీ ప్రావీణ్యాన్ని ప్రదర్శిస్తూ కళ్ళనీళ్ళ పర్యంతంగా ఉపన్యాసం దంచారు. జాతినుద్దేశించి ఆయన చేసిన ప్రసంగంగా దానిని అభివర్ణించారు. నిజానికి నిజంగానే దేశానికి విపత్కర పరిస్థితులు సంభవించినా దేశ ప్రధాని అలాంటి పద్ధతిలో జాతినుద్దేశించి ప్రసంగించరాదు. అలాంటిది ఎటు వంటి విపత్కర పరిస్థితులు లేకుండానే చేసిన ఆ ప్రసంగంలో ప్రధాని హిందూ సంస్థలపై తనకు గల విద్వేషాన్ని బహిరంగంగానే వెళ్ళగక్కారు. కేవలం మాటల లోనే కాక ముఖకవళికలలో కూడా ఆ ద్వేషాన్ని ఆయన దాచుకోలేదు. ప్రశాంతతను కాపాడవలసిన ఆ క్షణాలలో ద్వేషాన్ని ఆయన నూరిపోశారు. ప్రధాని చేసిన ఆ ప్రసంగం రాత్రి పదేపదే చూపబడింది. దాని ద్వారా ముస్లిం సమాజానికి ఒక స్పష్టమైన సంకేతం ఇవ్వబడింది. ప్రధాని అందించిన ప్రోత్సాహంతో మిగిలిన పనిని దేశంలోని వార్తా పత్రికలు పూర్తిచేశాయి. సాధారణంగా ఎన్నడూ ఆ కట్టడాన్ని మసీదుగా సంబోధించని, నియమ నిబంధలను దృఢంగా అనుసరించే పత్రికలు సైతం 'బాబరీ మసీదు కూలిపోయిం'దంటూ పెద్ద పెద్ద శీర్షికలు, సంపాదకీయాలను గుమ్మరించాయి. వాటన్నింటి ఫలస్వరూపంగానే డిసెంబర్ 7వ తేదీ దేశానికి అల్లర్లు, దహనకాండ, హత్యలతో తెల్లవారింది. రాత్రిలేని ఉన్మాదం, తెల్లవారేసరికి ముస్లిం మూకలలో నింపబడింది. పెద్ద ఎత్తున దేశమంతటా వారు వీధుల్లో పడ్డారు.

ఇంతకంటే దురదృష్టకర సంఘటన ఆ రాత్రి మరొకటి జరిగింది. జాతి యావత్తు సిగ్గుతో తలవంచుకునే విధంగా ప్రధానమంత్రి, రాష్ట్రపతులు దూరదర్శన్‌లో నేను ప్రసంగిస్తానంటే నేను ప్రసంగిస్తానంటూ పోటీలు పడ్డారు. జాతి నుద్దేశించి ప్రసంగించే విషయంలో ప్రాధాన్యత ఎవరికి ఇవ్వాలన్న విషయంలో ప్రధానమంత్రి కార్యాలయానికి, రాష్ట్రపతి భవన్‌కు మధ్య వివాదం నడిచింది. రాత్రి హిందీ వార్తల అనంతరం సమయాన్ని అప్పటికే ప్రధానమంత్రికి కేటాయించడం జరిగిపోయింది కనుక రాష్ట్ర పతి ఇంగ్లీషు వార్తల తరువాత సమయాన్ని వినియోగించుకోవాలని ప్రధానమంత్రి

కార్యాలయం సూచించింది. ఇందుకు ఆగ్రహించిన రాష్ట్రపతి అసలు దూరదర్శన్‌లో ప్రసంగించే ప్రస్తావనే మానుకున్నారు. అందుకు బదులుగా ఎప్పుడూ లేని ఒక సంప్రదాయాన్ని సృష్టిస్తూ అసాధారణ రీతిలో రాష్ట్రపతి భవన్‌నుండి అయోధ్య సంఘటనలను తీవ్రంగా ఖండిస్తూ పత్రికా ప్రకటన విడుదల చేశారు. 'బాబరీ మసీదు కూలిపోయిం'దనే అసత్యాన్ని ఆయన కూడా తన ప్రకటనలో వల్లించారు.

వీరికేమాత్రం తీసిపోనని నిరూపించుకునేందుకా అన్నట్లు ఉపరాష్ట్రపతి శ్రీ కె.ఆర్. నారాయణన్ కూడా మరుసటి నాడు రాజ్యసభలో చేసిన ప్రకటనలో 'బాబరీ మసీదు కూల్చివేత' ను 'గాంధీజీ హత్య' తో సమానమైన సంఘటనగా ప్రకటించి తన అజ్ఞానాన్ని చాటుకున్నారు.

ఈ దేశంలో అసంఖ్యాక దేవాలయాలు ధ్వంసం చేయబడిన రోజున గాయపడిన హిందువుల మనోభావాలను శాంత పరిచేందుకు ఏ నాయకుడూ దూరదర్శన్‌లో ప్రసంగాలు చేయలేదు. లక్షలాది హిందువులు స్వగృహాల నుండి తరిమికొట్టబడి స్వదేశంలోనే శరణార్థులుగా మారి ఢిల్లీ, జమ్మూ వీధులలో ఎముకలు కొరికే చలిలో నికృష్ట జీవితం గడుపుతూ ఉంటే పలకరించే తీరిక వీరికి లేదు. వారి ప్రార్థనా స్థలాలు ధ్వంసం చేయబడినప్పుడు, వారి తల్లులు, చెల్లులు ఘోర అకృత్యాలకు బలిచేయబడినప్పుడు, సంక్షుభిత హిందూ హృదయాలకు స్వాంతన కలిగించడానికి జాతినుద్దేశించి ఏ నాయకుడూ ప్రసంగించలేదు. నరహంతక ములాయం ముఠా నవంబర్ 2, 1990 నాడు అయోధ్య వీధులలో నరసంహారం జరిపి చేత కమండలం, నోట శ్రీరామనామజపం తప్ప మరేమీ లేని అమాయక రామభక్తులను అసంఖ్యాకంగా పొట్టన బెట్టుకున్న నాడు వీరెవరూ దూరదర్శన్‌లో కెక్కి దొంగ కన్నీళ్ళు కార్చలేదు.

మరి ఈ రోజున ఒక శిథిల కట్టడం కూలిపోతే ఇంత ఆవేదన చెందిపోతున్నారెందుకని? బహుశః వారి దృష్టిలో మనోభావాలు ముస్లింలకే తప్ప హిందువులకుండవా?

## ఆలయాలు కూలినపుడు మౌనం ఎందుకు వహించారు?

బాబరీ కట్టడం కూలినందుకు ముస్లింల మనోభావాలు గాయపడి ఉంటాయని భావించడంలో అనౌచిత్యం ఏమీలేదు. కానీ ఒక శిథిల కట్టడం పట్లనే వీరందరి మనోభావాలు ఇంత తీవ్రంగా ఉన్నప్పుడు బాబరు, గజనీ వంటి ధూర్త విదేశీ దురాక్రమణదారుల చేతుల్లో అయోధ్య, కాశీ, మథుర, సోమనాథ్ వంటి పవిత్ర దేవాలయాలు ధ్వంసమైన రోజు హిందువుల మనోభావాలు ఎంత గాయపడి ఉంటాయో వీరెవరైనా ఊహించారా? గతంలో తమిళనాట ద్రవిడ పార్టీలు శ్రీరాముడి ప్రతిమలకు చెప్పులదండలు వేసి ఊరేగించిన రోజున వీరెవరూ ఎందుకు ఖండనలు చేయలేదు?

కాశ్మీర్‌లో ఒక్క అనంతనాగ్ జిల్లాలోనే 50 పైగా దేవాలయాలు 1986వ సంవత్స

రంలో ముస్లిం తీవ్రవాదుల చేతుల్లో నేలమట్టం చేయబడ్డాయి. అనేక దేవాలయ భూములు ముస్లింమూకల కబ్జాలకు గురై వివాదాలలో మునిగిపోయాయి. ఆ రోజున హిందువుల మనోభావాలకు ఎంత తీవ్రంగా దెబ్బ తగిలి ఉంటుందన్నది మరి వీరెవరికీ పట్టలేదా?

వివాదాస్పద పూజాస్థలాల బిల్లు ద్వారా హిందువుల హృదయాలను గాయపరచిన ప్రభుత్వం ఆ బిల్లు పరిధి నుండి జమ్మూ-కాశ్మీర్‌ను మినహాయించి వారిని మరింత క్షోభకు గురిచేసింది. తమకు ఈవ్యవస్థ న్యాయం చెయ్యదని నిశ్చయంగా ఋజువైనప్పుడు వ్యక్తి దానిని ధిక్కరించడం ప్రారంభిస్తాడు. ప్రస్తుతం ప్రభుత్వం హిందువులను ఆ దిశగా బలవంతంగా నెట్టుతోంది.

కాశ్మీర్‌ను వివాదాస్పద బిల్లు నుండి మినహాయించడం వెనుక ముస్లింలను సంతృప్తిపరచాలన్న దురుద్దేశం తప్ప ప్రభుత్వానికి మరొకటి ఉన్నట్లు కనబడదు. ఎందుకంటే హిందువులు కోరిన మూడు దేవాలయాలను (కాశీ, మధుర, అయోధ్య) వారికి దక్కకుండా చేయాలని ప్రభుత్వం ఈ చట్టం చేసింది. కానీ అదే చట్టాన్ని కాశ్మీర్‌కు వర్తింపచేస్తే మూడుకు బదులు మూడువందల ఆలయాలు హిందువులకు అప్పగించవలసి ఉంటుంది. అందుకే ఈ ఎత్తుగడ.

1947 తరువాత కాశ్మీర్‌లో అనేక హిందూ దేవాలయాలు, ఇతర ఆస్తులను ముస్లిం తీవ్రవాదులు ధ్వంసం చేశారు. ఇంకా అనేక అటువంటి ధార్మిక స్థలాలు ముస్లింల అక్రమ కబ్జాల కారణంగా వివాదాస్పదంగా మిగిలిఉన్నాయి. ప్రార్థనాస్థలాల బిల్లును కాశ్మీర్‌కు వర్తింపజేసినట్లైతే వీటినన్నింటినీ హిందువులకు తిరిగి అప్పగించవలసి ఉంటుంది. మసీదులు కాని మూడు మసీదులకోసం ముస్లింల తరఫున చట్టం చేయటానికి ఈ ప్రభుత్వానికి అభ్యంతరం లేదు. కానీ అదే హిందువులకు వర్తింపజేయడానికి మాత్రం దమ్ములు లేవు.

1947 తరువాత వివాదాస్పదంగా మారిన హిందూ ప్రార్థనాస్థలాలు కాశ్మీర్‌లో లెక్కలేనన్ని ఉన్నాయి. శ్రీనగర్ సమీపంలో వితస్తా, దూద్‌గంగానదుల సంగమ ప్రదేశంలో ఉన్న విఖ్యాత బమఖాటకేశ్వర భైరవమందిరం హిందూ ముస్లిం వివాదం కారణంగా గత 20 సంవత్సరాలుగా మూతబడి ఉంది. కొంతభాగాన్ని ముస్లింలు కబ్జా చేశారు కూడా. అమరనాథ్ యాత్రామార్గంలో గల 'అమరనాథ్ యాత్రా కాంపింగ్ పార్క్' సంవత్సరాలుగా వివాదంలో పడి ఉంది. ఈ స్థలం గురించి హిందూ-ముస్లింల మధ్య అనేక పర్యాయాలు ఘర్షణలు జరిగాయి. ఈ ఘర్షణలవల్ల ఒకసారి అమరనాథ్‌యాత్రలనే నిలిపివేయవలసి వచ్చింది.

అమరనాథ్ యాత్రలో మరొక ప్రముఖ మజిలీ అయిన గౌతమనాగ్ తీర్థం వివాదాలలో ఉంది. శ్రీనగర్ శివార్లలోని శంకరాచార్య పర్వతం వద్దగల దుర్గానాగ్ మందిర్‌కు

చెందిన స్థలంలో ముస్లిం జేకాఫ్ట్రస్ట్ అనే సంస్థ 'సులేమాన్ కాంప్లెక్స్' పేరుతో రెండు పెద్ద అక్రమ కట్టడాలను నిర్మించింది. కుప్వారాలోని మంగళదేవి దేవాలయాన్ని ఈమధ్యనే ముస్లింల స్థావరంగా మార్చుకున్నారు. కొద్ది ఏండ్ల క్రితం వరకు కృష్ణాష్టమి ఊరేగింపు ఇక్కడినుంచే బయలుదేరుతూ ఉండేది.

ప్రఖ్యాత కాశ్మీరీ శైవమతాచార్యుడు, సంస్కృత మహాపండితుడు అయిన అభినవగుప్తా సమాధిస్థలం 'బహురూపగుహా'లో ప్రస్తుతం హిందువులకు ప్రవేశం నిషిద్ధం. ఇదేవిధంగా సోపోర్‌లోని ఋషీపీర్ మందిరపు పూజారుల నివాసస్థలం, కుప్వారాలోని దేవాలయపు సరస్సు, సోపోర్‌లోని జనపోరాశ్రమ్, ఛింద్వారాలోని సప్తర్షి తీర్థం, శ్రీనగర్ శివార్లలోని కోహన్‌ఖాన్ మందిరం, తజర్‌లోని హరనాగ్ తీర్థం, మట్టన్‌లోని బుమజువ మందిరంలాంటి అనేక ప్రసిద్ధ మందిరాలు ప్రస్తుతం వివాదాలలో కూరుకునిపోయి ఉన్నాయి.

ఇవికాక కాశ్మీర్‌లోయలో హిందువులకు చెందిన 27 స్మశాన వాటికలు కూడా ముస్లింల అక్రమ ఆక్రమణలకు గురై వివాదాస్పదంగా మిగిలిఉన్నాయి.

గత 2,3 సంవత్సరాలుగా ముస్లింల దాడులలో ధ్వంసమైన హిందూ దేవాలయాల సంఖ్య కూడా తక్కువేమీ కాదు.

తుల్‌ములాలోని క్షీరభవానీ మందిరంపై 1991 ఏప్రిల్ 4వ తేదీన రాకెట్లతో దాడి జరిగింది. 1991 మే 4నాడు తిరిగి తుపాకిగుండ్ల దాడికి అది గురి అయ్యింది. సత్యూబర్‌బర్‌షాకు చెందిన రామేశ్వర మహాదేవ మందిరం, గౌరీశంకర మందిరాలు తగులబెట్టబడ్డాయి. ఇది 1988లో జరిగింది. ఆ తరువాత హబ్బాకాదల్‌లోని సోమనాథ మందిరం, ధర్మసత్రం, దుకాణాలు అన్నీ తగులబెట్టబడ్డాయి. ఫతేకాదల్‌లోని శివాలయంపై '89 జనవరి 26నాడు ముస్లింలు దాడిచేసి ధ్వంసం చేశారు. దానిలోని ధర్మసత్రాన్ని తగులబెట్టారు. బడ్షాలోని అమరేశ్వర మహాదేవ్ మందిరంపై 1990 మే 19నాడు బాంబు విసిరి, ధ్వంసం చేశారు. ఇదే పద్ధతిలో ఛింద్వారాలోని నేహామా, సోనాబారిలోని సుంబల్, సోపూర్‌లోని సీర్, అనంతనాగ్‌లోని నాగబల్, చీనీగుండ్, లోక్‌భవన్‌లోని లోకపుణ్య, గోసాయికుండ్ మొదలైన ప్రార్థనాస్థలాలెన్నో ధ్వంసం చేయబడ్డాయి. అమీర్‌కాదల్‌లోని హనుమాన్ మందిరంపై గత 10 సంవత్సరాలలో ఎన్నిసార్లు దాడులు జరిగాయో లెక్కలేదు. 1986లో అనంతనాగ్‌లో చెలరేగిన మతకలహాలలో అనేక దేవాలయాలు, గోశాలలు, ధర్మసత్రవులు దగ్ధం చేయబడ్డాయి.

సాధుగంగా తీర్థాన్ని అక్రమంగా కబ్జా చేయడమేకాక అక్కడ నివసిస్తూ ఉండిన మహంత్ బ్రజనాథ్‌షా అనే సాధువును 1990 ఏప్రిల్ 27నాడు హత్యచేశారు కూడా. శ్రీనగర్‌లోని విచారనాగ్ తీర్థానికి చెందిన స్వామీ కేశవనాథ్‌కు కూడా ఇదే గతి పట్టింది. 1991 జనవరిలో ఆయన హత్య చేయబడ్డారు. ఆ తదుపరి మంజగావ్ తీర్థస్వామీజీని

కూడా హత్యచేశారు.

ఇంత స్పష్టమైన ఆధారాలు కాశ్మీర్‌లో కనిపిస్తూ ఉన్నా ప్రభుత్వానికి ప్రార్థనాస్థలాల చట్టం అక్కడికి వర్తింపజేయాలన్న ధైర్యం కలుగడంలేదు. ఏమిటి కారణం? వాడుకలో ఉన్న దేవాలయాలకంటే విసర్జించిన మసీదులే ప్రాముఖ్యత కలిగినవా?

1989లో కేంద్ర ప్రభుత్వ సహకారంతోనే అయోధ్యలో శిలాన్యాసం జరిగింది. అప్పుడూ కాశ్మీర్, పాకిస్తాన్, బంగ్లాదేశ్‌లలో ఆలయాలు ధ్వంసం చేయబడ్డాయి. 1990లో కరసేవ జరిగినప్పుడూ అదే జరిగింది. అయినా ప్రభుత్వం గానీ, రాజకీయ నాయకులు గానీ నోరెత్తలేదు. ముస్లింల మనోభావాల విషయంలో అవసరానికి మించి ఆసక్తిని, ఆవేదనను ప్రదర్శించే ఈ నాయకులకు హిందూ మనోభావాల విషయంలో ఇసుమంతైనా గౌరవం లేదెందుకని?

## ఎవరిది మొండితనం?

హిందూ సంస్థలు మొండితనంతో వ్యవహరిస్తున్నాయని, దేవాలయం అక్కడే నిర్మించాలని అనౌచిత్యంతో పట్టుబడుతున్నాయని విమర్శలు చేసే నాయకులు అసలు మొండిపట్టుదల ఎవరిదన్న విషయాన్ని గ్రహించడం అవసరం. గత 43 సంవత్సరాలుగా పూజలందుకుంటున్న బాలరామునికి అదేస్థలంలో దేవాలయం నిర్మించాలనుకోవడం మొండితనమా? లేక దేవాలయ విధులు జరుగుతున్నా ఆస్థలాన్ని మసీదుగా మార్చమనడం మొండితనమా?

పైగా పూర్వం అక్కడ ఒక దేవాలయం ఉండేదని, బాబరు ఈ దేశం మీద దండయాత్ర చేసిన సమయంలో ఆదేవాలయాన్ని ధ్వంసం చేసి, దాని శిథిలాలపై ప్రస్తుత కట్టడాన్ని నిర్మించాడని నిరూపించే అనేక చారిత్రక ఆధారాలను.....స్వయంగా ముస్లిం చరిత్రకారులు చెప్పిన విషయాలతో సైతం......విశ్వహిందూ పరిషత్ ప్రభుత్వానికి సమర్పించింది.

అంతేకాదు. గత జూన్‌లో కొందరు ప్రఖ్యాత పురాతత్వ వేత్తలు అయోధ్యలో సాగించిన త్రవ్వకాలలో అక్కడ ఒక ఆలయం ఉండేదన్న పురాతత్వ ఆధారాలు కూడా అనేకం లభ్యం అయ్యాయి.

అయోధ్యలోని వివాదాస్పద కట్టడం నిలిచి ఉన్న స్థలంలో ఒకప్పుడు హిందూ దేవాలయం ఉండేదని నిరూపించే స్పష్టమైన పురాతత్వ ఆధారాలు ఈ మధ్య త్రవ్వకాలలో బైటపడ్డాయి. అయోధ్య వివాదంపై విశ్వహిందూ పరిషత్, బాబరీ మసీదు యాక్షన్ కమిటీల మధ్య జరుగుతున్న చర్చలలో ఈ పురాతత్వ ఆధారాలు కూడా ప్రముఖంగా చోటు చేసుకున్నాయి.

పురాతత్వానికి సంబంధించినంతవరకు ప్రశ్న ప్రస్తుతం వివాదాస్పద కట్టడం నిలచి ఉన్న రామజన్మభూమిపైన యాజమాన్యపు హక్కు ఎవరికి ఉన్నదనేది. 1528వ

సం.ములో మీర్ బాంకీ అనే బాబర్ సేనాని అక్కడ ఒక కట్టడాన్ని నిర్మించాడని, అదే బాబరీ మసీదని ముస్లింల అభిప్రాయం. హిందువులు దీనిని విభేదించడం లేదు. అయితే ఆ స్థలంలో 11వ శతాబ్దం నుండి నాగరి శైలికి చెందిన ఒక ప్రాచీన దేవాలయం ఉండేదని, బాబర్ ఆదేశం మేరకు మీర్‌బాంకీ, ఇతరులు ఆ దేవాలయాన్ని పడగొట్టి వివాదాస్పద కట్టడాన్ని నిర్మించారని వారి వాదం. బాబర్ రాకకు పూర్వం వందల సంవత్సరాలపాటు రామునితో సహా వివిధ అవతారాలలో విష్ణు ఆరాధన అక్కడ జరిగేదని హిందువులు విశ్వసిస్తున్నారు.

ఈ అంశం మీద తమ తీర్పు నివ్వవలసిందిగా పురాతత్వవేత్తలను కోరడం జరిగింది. 1992 అక్టోబర్ 10వ తేదీ నుండి 13వ తేదీ వరకు నాలుగురోజులపాటు అయోధ్యలో సమావేశమైన దేశంలోని 45మంది ప్రముఖ పురాతత్వవేత్తలు వివిధ ఆధారాలను పరిశీలించి తమ తీర్పు ప్రకటించారు. గతంలో ప్రొ. ఎ.కె. నారాయణన్, ప్రొ. బి.బి. లాల్ తదితర పురాతత్వవేత్తలు సాగించిన త్రవ్వకాలలో వివిధ కాలాలకు చెందిన అవశేషాలు లభించడాన్ని పరిశీలించిన ఈ పురాతత్వజ్ఞుల సమావేశం రామజన్మభూమి స్థలం కనీసం గత 3వేల సంవత్సరాలుగా ఇప్పటి హిందువుల పూర్వీకుల అధీనంలోనే ఉండేదని అభిప్రాయపడింది.

వివాదాస్పద స్థలంలో పూర్వం దేవాలయం ఉండేదని చూపే ఆధారాలు బాబరీ కట్టడం లోపల కొన్ని ఈ విధంగా ఉన్నాయి.

1. తథాకథిత 'బాబరీ మసీదు'లో పురాతత్వ భాగాలుగా ఉపయోగించబడిన కనీసం 14 నల్లరాతిస్తంభాలు ఉన్నాయి.
2. ప్రధాన ద్వారానికి ఉత్తరదిశగా ఉన్న ఒక నల్లరాతి స్తంభంపైన 11వ శతాబ్దానికి చెందిన, నాగరిలిపిలో వ్రాయబడిన 'సి' అక్షరం ఉంది.
3. తమ భుజాలపై పూర్ణ ఘటాలను మోస్తున్న యక్షులు చిత్రించబడ్డారు. ఆ ఘటాలలోని పవిత్రజలాలలో నుండి స్తంభాలు బైటికి వచ్చినట్లు చూపబడింది.
4. స్తంభం రూపంలో ఒక పెద్దరాయి ఉంది. కలువపువ్వుల చిత్రాలతో అది అలంకరింపబడి ఉంది. వివాదాస్పద కట్టడపు ప్రధానద్వారం వద్ద లింటల్‌గా (Lintel) అది వాడబడింది.
5. చెక్కడాలన్నీ ఒకే పద్ధతిలో ఉన్నాయి. ఒకే కాలానికి చెందినవిగా ఉన్నాయి. చెక్కిన పద్ధతినిబట్టి 10-12 శతాబ్దాల మధ్య కాలానికి అవి చెంది ఉంటాయని సులభంగా నిర్ణయించవచ్చు. ఎట్టి పరిస్థితులలోను 7వ శతాబ్దం కంటే ముందుకు గానీ 16వ శతాబ్దం తరువాతకు గానీ వాటిని అన్వయించడానికి వీలులేదు.
6. 1991 అక్టోబర్-నవంబర్‌లో కరసేవకులు వివాదాస్పద కట్టడపు తూర్పువైపు గోడపై రెండు భాగాలలో పైపూతను తొలగించి వేశారు. వాటిలో ఒకటి పోత పోయబడినట్లు ఉండగా, రెండవదానిపై పుష్పసంబంధ చెక్కడాలు కనిపించాయి.

7. వివాదాస్పద కట్టడపు తూర్పు సరిహద్దు గోడ క్రింది భాగంలో పూర్వపు దేవాలయ నేలభాగంగా అనుమానింపబడుతున్న అవశేషాలు కనిపించాయి.

పై ఆధారాలను బట్టి ఇవన్నీ 11వ శతాబ్దపు దేవాలయానికి చెందిన అవశేషాలేనని పురాతత్వ బృందం అభిప్రాయపడింది.

చారిత్రక, పురాతాత్విక ఆధారాల నేపథ్యంలో ఆ స్థలం ఒక దేవాలయ స్థలమని స్పష్టంగా నిరూపితమైంది. కోట్లాది ప్రజల మనోభావాలు ఆ భూమితో ముడిపడి ఉన్నాయి. అక్కడ బాలరాముని విగ్రహం ఉంది. ఏటా లక్షలాది భక్తుల చేత అది పూజలందుకుంటోంది. ఈ స్థితిలో ఆ భూమిలో భవ్యమైన దేవాలయాన్ని నిర్మించాలనుకోవడం మొండితనమా? పై విషయాలన్నింటినీ ప్రక్కకు పెట్టి....అంటే చారిత్రక, పురాతాత్విక ఆధారాలను కాదని, కోట్లాది హిందువుల మనోభావాలను త్రోసిరాజని, ప్రత్యక్షంగా పూజలందుకుంటున్న బాలరాముని విగ్రహాన్ని అక్కడినుండి తొలగించి ఆ స్థలంలో మసీదు నిర్మించాలని పట్టుబట్టడాన్ని ఏమని పిలవాలి?

ఎవరిది మొండితనం?

## న్యాయస్థానాల పట్ల గౌరవం లేనిదెవరికి?

హిందూ సంస్థలు న్యాయాన్ని, చట్టాన్ని, రాజ్యాంగాన్ని తమ చేతుల్లోకి తీసుకున్నాయని, పై వ్యవస్థల పట్ల అగౌరవంగా ప్రవర్తించాయని పగలనక, రాత్రనక ప్రచారం సాగుతోంది. ఇందులో వాస్తవం ఎంత?

రామజన్మభూమి ఉద్యమం ఏ దశలోనూ న్యాయస్థానాలను అతిక్రమించి సాగలేదు. 1989లో జరిగిన శిలాన్యాసంగానీ, ఆ తదుపరి జరిగిన కరసేవ కానీ పూర్తిగా చట్టానికి లోబడే జరిగాయి. న్యాయస్థానాలను అగౌరవపరిచే ఏ చర్యలకు హిందూ సంస్థలు ఎన్నడూ పాల్పడలేదు. ఆఖరికి గత జూలైలో జరిగిన కరసేవ సందర్భంగా కూడా సుప్రీంకోర్టు, అలహాబాద్ హైకోర్టుల అభ్యర్ధనకనుగుణంగా హిందూ సంస్థలు నిర్మాణ కార్యక్రమాన్ని అర్ధాంతరంగా వేరే స్థలానికి తరలించడానికి సైతం సిద్ధపడ్డాయి.

అయితే ఇదంతా న్యాయస్థానాలు తమపట్ల న్యాయోచిత వైఖరిని అవలంబిస్తాయనే ఆశతోనే. మొన్నటి కరసేవకు ముందు ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో నిర్వహించిన 6 రోజుల యాత్ర సమయంలో శ్రీ అద్వానీ కూడా కరసేవ శాంతియుతంగా ముగిసే విషయంలో తనకున్న ఏకైక ఆశ న్యాయస్థానాలు 2.77 ఎకరాల శిలాన్యాసస్థలం విషయంలో డిసెంబర్ 6వ తేదీకంటే ముందే తీర్పును ప్రకటిస్తాయన్నదేనని పదేపదే ప్రకటించారు. చివరికి న్యాయస్థానాలు సమర్ధనీయం కానిరీతిలో తీర్పును డిసెంబర్ 11వ తేదీకి వాయిదా వేసినపుడు కూడా హిందూ సంస్థలు చట్టాన్ని అతిక్రమించడానికి సిద్ధపడ లేదు. కనుకనే కరసేవకులను సరయూనదినుండి పిడికెడు మట్టి తెచ్చి శిలాన్యాస స్థలంలో ఉంచమని, అదే కరసేవ అని ఆదేశించారు.

న్యాయస్థానాల పై సంపూర్ణ విశ్వాసంతోనే వివాదాస్పద కట్టడానికి సంబంధించిన పూర్వ చరిత్రను ఏకైక ప్రశ్నగా సుప్రీంకోర్టు ముందు ఉంచడానికి కూడా హిందూ సంస్థలు అంగీకరించాయి.

కానీ అందుకు బదులుగా అటు న్యాయస్థానాలు, ఇటు కేంద్ర ప్రభుత్వం కూడా హిందూ సంస్థలను, కరసేవ కార్యక్రమాన్ని ఇబ్బందుల పాలు చేయడానికే ప్రయత్నించాయి. కరసేవను నిరోధించాలని, లేకపోతే ఆ స్థలాన్ని తమ స్వాధీనం చేసుకుంటామని, రిసీవర్‌ను నియమిస్తామని సుప్రీంకోర్టు పదేపదే బెదిరించింది. ఉత్తరప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేస్తామని కేంద్ర ప్రభుత్వంలోని కొందరు నాయకులు బాధ్యతా రహితంగా ప్రకటనలు చేస్తూ వచ్చారు.

హిందూ సంస్థలు న్యాయవ్యవస్థను అవహేళన చేస్తున్నాయంటూ వాపోతున్న కాంగ్రెస్, జనతాదళ్ వగైరా పార్టీల నాయకులు తమ తమ గత చరిత్రలను ఒకసారి గుర్తుచేసుకోవడం అవసరం. కోర్టు తీర్పులను సక్రమంగా అమలు చేయకపోతే రాష్ట్ర ప్రభుత్వంపై చర్య తీసుకుంటామంటూ పదేపదే ప్రకటించి సుప్రీంకోర్టు కూడా గతంలో నిర్లజ్జగా జరిగిన కోర్టు ధిక్కార సంఘటనలలో తాను ఏ చర్యలు తీసుకుందో గుర్తు చేసుకోవాలి.

1986 షాబానో ప్రకరణం జగమెరిగినదే. తన 13వఏట వివాహం అయిన ఇండోర్‌కు చెందిన ముస్లిం మహిళ షాబానోను 60ఏళ్ళ వైవాహిక జీవనం తరువాత న్యాయవాది అయిన ఆమె భర్త 'తలాక్' అంటూ విడాకులు ఇచ్చి, వృద్ధాప్యంలో ఆమెను నడిరోడ్డుపాలు చేశాడు. తనకు భర్తనుండి మనోవర్తి ఇప్పించవలసిందని కోరుతూ ఆమె సుప్రీంకోర్టును ఆశ్రయించింది. కోర్టు మానవతాదృష్టితో ఆమెకు నెలనెలా భరణం ఇవ్వాలని ఆమె మాజీ భర్తను ఆదేశించింది. అంతే! మిన్నువిరిగి మీదపడ్డట్లు ముల్లామౌల్వీలు, మతమౌఢ్య ముస్లిం నాయకులు అలజడి ప్రారంభించారు. విడాకులిచ్చిన స్త్రీకి మనోవర్తి చెల్లించడం ముస్లిం వ్యక్తిగత చట్టానికి వ్యతిరేకమని మూర్ఖంగా వాదించడం ప్రారంభించారు. షాబానోకు భరణం ఇవ్వమన్న పాపానికి షహబుద్దీన్ తదితరుల నాయకత్వంలో మతమౌఢ్య ముస్లింలు ఢిల్లీలో, దేశమంతటా సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ చంద్రచూడ్ దిష్టిబొమ్మలను దగ్ధం చేశారు. ఆ రోజున సుప్రీంకోర్టు ఆ నాయకులను ఏం చేయగలిగింది?

షాబానో కేసులో సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పును త్రోసిరాజనే విధంగా మత మౌఢ్య ముల్లా మౌల్వీల ఒత్తిడికి లొంగి అప్పటి కాంగ్రెస్ కేంద్ర ప్రభుత్వం ముస్లిం మహిళల విడాకుల చట్టాన్ని తీసుకువచ్చింది. ముస్లిం మహిళల పరిరక్షణ చట్టం అని ప్రజలను తప్పుదోవపట్టించే విధంగా పేరుపెట్టిన ఆ చట్టంలో శ్రీ రాజీవ్ ప్రభుత్వం 'తలాక్' (విడాకులు) ప్రకటించిన స్త్రీలకు ముస్లింలు మనోవర్తి చెల్లించనవసరం లేదని

పేర్కొంది. అలాంటి స్త్రీల పోషణ భారాన్ని వక్ఫ్‌బోర్డులు స్వీకరించాలని పేర్కొంది. వక్ఫ్‌బోర్డుల వద్ద ధనం లేకపోతే ప్రభుత్వం గ్రాంటులను ఇస్తుందని కూడా ప్రధాని ప్రకటించారు. అంటే ముస్లింలు తమ స్త్రీలను వీధుల్లోకి గెంటితే వారిని పోషించే బాధ్యత హిందువులు చెల్లించే పన్నుల ద్వారా వచ్చిన ఆదాయంతో ప్రభుత్వం స్వీకరిస్తుందన్నమాట. ఇక సుప్రీంకోర్టు తీర్పుకు గల విలువ ఏమిటి? మరి న్యాయస్థానాలపై వారికి గల గౌరవం అదేనా?

హిందువులకు, ముస్లింలకు వేరువేరు చట్టాలు ఉండడం తగదని, కనుక సాధ్యమైనంత త్వరగా ఉమ్మడి పౌరచట్టాన్ని (Uniform Civil Code) ప్రవేశపెట్టాలని రాజ్యాంగ నిర్మాతలు ఆదేశిక సూత్రాలలో స్పష్టంగా పేర్కొన్నారు. దేశ సమైక్యత, సమగ్రతల దృష్ట్యా ఉమ్మడి పౌరచట్టం అవసరమని గతంలో భారతీయ జనసంఘ్, ప్రస్తుతం బిజెపి, ఆరెస్సెస్ వగైరా జాతీయవాద సంస్థలు పదేపదే కోరుతూ వచ్చాయి. కానీ మతమౌఢ్య ముస్లిం నాయకత్వాన్ని సంతృప్తిపరచడంకోసం ప్రభుత్వం ఈ ప్రతిపాదనను తిరస్కరిస్తూ వచ్చింది.

1986లో ఢిల్లీలో ఉమ్మడి పౌరచట్టంపై చర్చించడానికి దేశంలోని ప్రముఖ న్యాయవాదులు, న్యాయమూర్తులు సమావేశం అయ్యారు. ఉమ్మడి పౌరచట్టం ఉండాలని దాదాపు వారంతా ఏకగ్రీవ నిర్ణయానికి వచ్చారు. కాగా ఆ సమావేశానికి ముఖ్యఅతిథిగా వచ్చిన అప్పటి న్యాయశాఖామంత్రి, స్వయంగా నిష్ఠావంతుడైన ముస్లిం అయిన శ్రీ జడ్.ఆర్. అన్సారీ మాత్రం ఈ ప్రతిపాదనను గట్టిగా వ్యతిరేకించారు. ఫలితంగా తీర్మానంలో హాస్యాస్పద రీతిలో 'ఉమ్మడి పౌరచట్టం' అన్న దానిని 'ఐచ్ఛిక ఉమ్మడి పౌరచట్టం' (Optinal Common Civil Code) అని మార్చవలసి వచ్చింది. ఇదీ మన నాయకులకు న్యాయస్థానాలు, రాజ్యాంగం పట్ల గల గౌరవ ప్రపత్తులకు చిహ్నం.

1975లో అలహాబాద్ హైకోర్టు అప్పటి ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ ఎన్నిక చెల్లదని ప్రకటించింది. న్యాయస్థానాలపట్ల గౌరవం ఉండి ఉంటే ఆమె వెంటనే రాజీనామా చేసి ఉండవలసింది. కానీ పదవీ వ్యామోహంతో ఆమె కోర్టు తీర్పును త్రోసిరాజన్నారు. దేశంలో ఎమర్జెన్సీని విధించారు. ఆనాడు కాంగ్రెస్‌వారు, కమ్యూనిస్టులు ఇందిరకు వంతపాడారు. న్యాయస్థానాలు, ప్రజాస్వామ్య విలువల రక్షణకు ఆనాడు కంకణం కట్టుకుని, ఎమర్జెన్సీకి వ్యతిరేకంగా పోరాడినది భారతీయ జనసంఘ్, ఆరెస్సెస్‌వంటి సంస్థలే.

న్యాయస్థానాలను తన చెప్పుచేతల్లో ఉంచుకొనే దురుద్దేశంతో శ్రీమతి గాంధీ న్యాయమూర్తుల ఎన్నికను కూడా రాజకీయం చేశారు. సీనియారిటీని కాదని తనకు అనుకూలురైన జూనియర్ న్యాయమూర్తులను ప్రధాన న్యాయమూర్తులుగా నియమించారు. జస్టిస్ హెచ్.ఆర్. ఖన్నావంటి సీనియర్ న్యాయమూర్తులు కూడా ఈ వివక్షతకు

బలయ్యారు. ఆరోజున న్యాయస్థానాల పవిత్రతకోసం పార్లమెంట్ లోపల, బైట కూడా పోరాడినది భారతీయ జనతాపార్టీ మాత్రమే.

న్యాయస్థానాలపట్ల తమకు అపారమైన గౌరవముందని చెప్పుకుంటూ, రామజన్మభూమివంటి మతవిశ్వాసాలకు సంబంధించిన సమస్యను కోర్టులకు నివేదించాలని వాదిస్తున్న కాంగ్రెస్ తదితరసంస్థలు గతంలో కలకత్తా హైకోర్టులో చంద్‌మల్‌చోప్రా అనే విశ్వహిందూ పరిషత్ కార్యకర్త ఖురాన్‌లోని అభ్యంతరకర అంశాలను ఉటంకిస్తూ వాటిని నిషేధించాలని కోరితే ఆ విషయాలపై తీర్పు చెప్పే అధికారం కోర్టులకు లేదని ప్రకటించలేదా? ముస్లింమత విశ్వాసాలతో ముడిపడి ఉన్న ఆ అంశాలు కోర్టుల పరిధిలోకి రావని, కనుక తానే ఆ కేసులో విచారణను విరమింపజేశానని స్వయంగా అప్పటి ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ ప్రకటించారు. హిందూమత విశ్వాసాలు న్యాయస్థానాల పరిధిలోకి వచ్చినపుడు ముస్లిం మతవిశ్వాసాలు ఎందుకు రావు? ఇదేనా న్యాయస్థానాలపై నాయకులకుగల గౌరవం? 1989లో శిలాన్యాసం జరుప తలపెట్టిన స్థలాన్ని జిల్లా న్యాయస్థానం సరిగ్గా శిలాన్యాసానికి ముందు రోజు రాత్రి వివాద రహితమైనదిగా ప్రకటించి, శిలాన్యాసానికి విశ్వహిందూ పరిషత్‌కు అనుమతినిచ్చింది. ఈ విషయంలో శ్రీ రాజీవ్‌ను వివరణ కోరిన అప్పటి ఆయన సహచరుడు శ్రీ అరుణ్ నెహ్రూకు లభించిన సమాధానం ఏమిటి? 'ముస్లిం మహిళ చట్టం ద్వారా మతమౌఢ్య ముస్లింలను సంతృప్తి పరచడానికి మనం చేసిన ప్రయత్నానికి సమాంతరంగా మత ఛాందస హిందువులకోసం తీసుకున్న నిర్ణయం ఇది' అని వ్యాఖ్యానించారు రాజీవ్. అంటే న్యాయస్థానం, రాజ్యాంగం అనేవి ఆయన దృష్టిలో ఓట్ల సాధనకు మార్గాలు తప్ప మరేమీ కానట్లే కదా!

1990 అక్టోబర్ 30 వ తేదీన తొలిసారిగా కరసేవ జరపాలని విశ్వహిందూ పరిషత్ నిర్ణయించింది. ఆ కరసేవను అడ్డుకునే ప్రయత్నాలలో అప్పటి యు.పి. ముఖ్యమంత్రి శ్రీ ములాయంసింగ్ యాదవ్ అన్ని రకాల న్యాయ, నైతిక సూత్రాలను కాలరాచాడు. వివిధ న్యాయస్థానాలిచ్చిన 130కి పైగా ఆదేశాలను ధిక్కరించి కరసేవకులపై విరుచుకుపడ్డాడు. ఆరోజున సుప్రీంకోర్టు ఎందుకు నోరెత్తలేదు?

మండల్ కమీషన్ విషయంలో సుప్రీంకోర్టు తీర్పు తమ ప్రభుత్వ నిర్ణయానికి వ్యతిరేకంగా వస్తే రాజ్యాంగాన్ని మార్చడానికైనా తాను సిద్ధమేనని ప్రకటించిన శ్రీ వి.పి. సింగ్, ఆయన అనుచరులు బిజెపికి, హిందూ సంస్థలకు హితోపదేశాలు చేయగలిగినంతటివారా?

న్యాయస్థానాల పట్ల ఈ నాయకులకు గల గౌరవం ఏపాటిదో పై సంఘటనలే నిరూపిస్తాయి. అటువంటి నాయకులు హిందూ సంస్థలకు, న్యాయస్థానాలకు విలువనివ్వమని హితోపదేశాలు జారీ చేయడం దయ్యాలు వేదాలు వల్లించడం కాదా?

## రాష్ట్ర ప్రభుత్వ నిజాయితీపై శంక ఎందుకు?

అయోధ్య సమస్య విషయంలో రాష్ట్ర ప్రభుత్వం తనను మోసగించిందని శ్రీ పి.వి. నరసింహారావు వాపోయారు. తననేకాక సుప్రీంకోర్టును కూడా ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం మోసగించిందని ఆయన ఆరోపించారు. ఆయన దృష్టిలో డిసెంబర్ 6వ తేదీనాడు కరసేవకుల చేతుల్లో బాబరీ కట్టడం బ్రద్దలు కావడం ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం చేసిన మోసమే.

వివాదాస్పద కట్టడాన్ని కాపాడతానని శ్రీ కళ్యాణ్‌సింగ్ ప్రభుత్వం సుప్రీంకోర్టుకు హామీ ఇచ్చిన మాట వాస్తవమే. ఆ హామీని ఆ ప్రభుత్వం నిలుపుకోలేక పోయిన మాట కూడా వాస్తవమే. అయితే అంతమాత్రం చేత రాష్ట్ర ప్రభుత్వం మోసం చేసిందని ఆరోపించడం అసమర్థుని ఆక్రందన మాత్రమే అవుతుంది.

అయోధ్యలో కరసేవ శాంతియుతంగా పూర్తి కావడానికి వీలుగా రాష్ట్ర ముఖ్యమంత్రి అన్ని చర్యలు తీసుకున్నారు. అయితే ఆవేశంతో కట్టడంపైకి దూసుకుపోతున్న కరసేవకులను నిరోధించడం ఆ రాష్ట్ర ప్రభుత్వానికే కాదు, ఆ స్థానంలో ఏ రాష్ట్ర ప్రభుత్వం ఉన్నా సాధ్యమయి ఉండేది కాదు. ఒకవేళ బలప్రయోగంతో వారిని నిరోధించే ప్రయత్నం చేస్తే అది రక్తపుటేరులకు దారితీసేది. శ్రీ కళ్యాణ్‌సింగ్ అందుకు సిద్ధపడలేదు. ఈ విషయాన్ని ముందే ఆయన సుప్రీంకోర్టుకు కూడా స్పష్టంచేశారు. వివాదాస్పద కట్టడాన్ని రక్షించడానికి తాను అన్ని ప్రయత్నాలు చేస్తానని, అయితే కరసేవకులపై కాల్పులకు మాత్రం ఆదేశాలివ్వలేనని సుప్రీంకోర్టుకు నివేదించిన అఫిడవిట్‌లో శ్రీ సింగ్ స్పష్టంగా పేర్కొన్నారు.

అంతేకాదు. సాధారణంగా ఇలాంటి సమయాలలో నాయకులు మౌఖిక ఆదేశాలనే జారీచేస్తారు. దానివల్ల తదుపరి దుష్పరిణామాలకు అధికారులు బాధ్యత వహించవలసి వస్తుంది. నిజాయితీపరుడైన శ్రీ కళ్యాణ్‌సింగ్ అలాకాక లిఖితపూర్వకంగా ఆదేశాలిచ్చి అధికారులపై నిందరాకుండా శ్రద్ధ తీసుకున్నారు. పైపెచ్చు అయోధ్యలో జరిగిన సంఘటనలకు నైతిక బాధ్యత వహిస్తూ ఆరోజు సాయంత్రమే ఆయన రాజీనామా కూడా చేశారు.

ఆ దినాన అయోధ్యలో ఉన్న సీనియర్ బిజెపి నాయకులు శ్రీ ఎల్.కె.అద్వానీ, డా. జోషీ, ఆరెస్సెస్ నాయకులు శ్రీ హెచ్.వి.శేషాద్రి-తమ శక్తిమేరకు కరసేవకులను నిరోధించే ప్రయత్నం చేశారు. కరసేవకులు వెంటనే కట్టడాన్ని విడిచి రాకపోతే తాను ఎత్తైన వేదికపై నుండి దూకుతానని శ్రీ అద్వానీ మైకుల్లో బెదిరించారు. ఆయనను వేదికపై ఉన్న సీనియర్ నాయకులంతా కలిసి వారించవలసి వచ్చింది. ఆరెస్సెస్ నాయకులు శ్రీ హెచ్.వి.శేషాద్రి కూడా 'స్వయంసేవకులైతే తిరిగి రండి' అని పదేపదే వివిధ భాషలలో కరసేవకులను హెచ్చరించారు. అయితే సాక్షాత్తూ హనుమంతుడే ఆవ

హించిన కరసేవకులను నిరోధించడం ఎవరి తరమూ కాలేదు. జరిగిన సంఘటనలకు బాధ్యత వహిస్తూ శ్రీ అద్వానీ కూడా వెంటనే పార్లమెంటులో ప్రతిపక్షనాయకునిగా తనకు గల కేబినెట్ మంత్రి హోదాకు రాజీనామా సమర్పించారు.

కాగా ఈ మొత్తం ప్రకరణంలో ప్రధాన సూత్రధారులు, కరసేవకుల ఆగ్రహానికి మూలకారకులు అయిన కేంద్ర ప్రభుత్వంలోని నాయకులు ఒక్కరు కూడా జరిగిన సంఘటనలకు బాధ్యత వహించి రాజీనామాకు సిద్ధపడక పోవడం వారి పదవీ వ్యామోహానికి ప్రత్యక్ష నిదర్శనం. 1990 కరసేవ తదుపరి నైతిక బాధ్యత వహించి రాజీనామా చేయకుండా ములాయం సింగ్ యాదవ్ ముఖ్యమంత్రి పదవిలోనే కొనసాగి రెండురోజుల తదుపరి కరసేవకులపై మారణహోమం జరిపించడం ద్వారా తన కక్ష తీర్చుకున్నాడు. కేంద్ర ప్రభుత్వం కూడా దాదాపు అదే మార్గాన్ని అనుసరించింది. కరసేవకులను తుపాకి గుళ్ళకైతే బలిచేయలేదు కానీ బిజెపి పాలిత రాష్ట్ర ప్రభుత్వాలను రద్దు చేయడం, వివిధ జాతీయ సంస్థలను మత సంస్థలుగా ముద్రవేసి నిషేధించడం, వాటి కార్యకర్తలను అరెస్ట్ చేసి వేధించడం, కార్యాలయాలు సీలు చేయడం వంటి అప్రజాస్వామిక వేధింపు చర్యలకు అది పాల్పడింది.

కరసేవకులను అదుపు చేయడంలో రాష్ట్ర ప్రభుత్వం విఫలం అయిందన్న నెపంతో ఆ రాత్రికి శ్రీ కళ్యాణ్‌సింగ్ ప్రభుత్వాన్ని కేంద్రం బర్తరఫ్ చేసింది. ఇది పూర్తిగా అప్రజాస్వామిక చర్య. ఆ రాష్ట్ర ప్రభుత్వం చేసిన తప్పిదం ఏమిటి? కరసేవకులను నిరోధించడానికి బలప్రయోగానికి పూనుకోకపోవడమే కదా! మరి డిసెంబర్ 6వ తేదీ సాయంత్రం 5.30 గంటలకు రాష్ట్ర ప్రభుత్వం రాజీనామా చేస్తే డిసెంబర్ 8వ తేదీ ఉదయం 5 గంటల వరకు....... అంటే దాదాపు 36 గంటలపాటు..... కేంద్ర ప్రభుత్వం కరసేవకులను నిరోధించడానికి అయోధ్యలో ఎటువంటి ప్రయత్నమూ ఎందుకు చేయలేదు. ఆ 36 గంటల వ్యవధిలో కరసేవకులు బాబరీ కట్టడపు శిథిలాలను తొలగించి, ఒక వేదిక నిర్మించి, దానిపై బాలరాముని తిరిగి ప్రతిష్ఠించి, మెట్లు, గోడలు, తాత్కాలిక గర్భగుడులను నిర్మాణం చేయగలిగారు. అంతవరకు కేంద్ర బలగాలు వారిని అక్కడి నుండి తొలగించే ప్రయత్నం చేయలేదు. కారణం ఏమిటి?

'ములాయంసింగ్ చేసిన పొరపాటును మేం చేయదల్చుకోలేదు' అని శ్రీ చవాన్ సమాధానం. అంటే కరసేవకులను తొలగించడానికి ఏ ప్రయత్నం చేసినా రక్తపుటేరులు పారుతాయన్న భయంతోనే కదా కేంద్ర బలగాలు 36 గంటలు తాత్సారం చేసినది! మరి అలాంటప్పుడు రాష్ట్ర ప్రభుత్వం కరసేవకులపై బలప్రయోగం చేయాలని ఆశించడంలో ఔచిత్యం ఉన్నదా?

వివాదాస్పద కట్టడాన్ని ఎట్టి పరిస్థితులలోను కాపాడాలని న్యాయస్థానాలిచ్చిన ఆదేశాలను రాష్ట్ర ప్రభుత్వం అమలు చేయలేదని, న్యాయస్థానాలను, కేంద్ర ప్రభుత్వాన్ని

శ్రీ కళ్యాణ్‌సింగ్ మోసం చేశారని, కనుక ఆ ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేస్తున్నామని ప్రధానమంత్రి ప్రకటించారు. మరి గతంలో శ్రీ ఎన్.డి. తివారీ నాయకత్వంలోని కాంగ్రెస్ ప్రభుత్వం సుప్రీంకోర్టు ఇచ్చిన ఒక ఆదేశాన్ని అమలు చేయడానికి అశక్తతను ప్రదర్శించింది. వారణాసిలో ఒక షియాల స్మశానంలో గల రెండు సున్నీ గోరీలను అక్కడినుండి తొలగించాలని సుప్రీంకోర్టు రాష్ట్ర ప్రభుత్వాన్ని ఆదేశించింది. కాగా అప్పటి కాంగ్రెస్ రాష్ట్ర ప్రభుత్వం ఆ విధంగా చేయడం వల్ల మత ఉద్రిక్తతలు పెరిగే అవకాశం ఉంది కనుక తానా చర్య తీసుకోలేనని తన అశక్తతను ప్రకటించింది. మరి అప్పుడు ఆ ప్రభుత్వం బర్తరఫ్ చేయబడలేదే?

అంతెందుకు! నిన్నగాక మొన్న కావేరీ జలాల పంపిణీ విషయంలో ట్రిబ్యునల్ ఇచ్చిన తీర్పును కర్ణాటకలోని బంగారప్ప నాయకత్వాన గల కాంగ్రెస్ ప్రభుత్వం ఏమాత్రం పట్టించుకోకపోగా, దానిని బహిరంగంగా ధిక్కరిస్తూ ప్రవర్తించినప్పటికీ కేంద్రం ఆ రాష్ట్ర ప్రభుత్వంపై ఎటువంటి చర్యను తీసుకోలేదు. మరి అలాంటప్పుడు యు.పి. ప్రభుత్వం రాజ్యాంగ ధిక్కారానికి పాల్పడిందని బర్తరఫ్ చేయడానికి కేంద్ర ప్రభుత్వానికి నైతిక హక్కు ఎక్కడ ఉంది?

ప్రధానికి ఒక సూటిప్రశ్న, ప్రధానమంత్రి భద్రత బాధ్యత హోంమంత్రిదవుతుంది. 1984లో శ్రీమతి ఇందిర హత్య చేయబడినప్పుడు ప్రస్తుత ప్రధాని శ్రీ పి.వి. హోంమంత్రిగా ఉన్నారు. అయోధ్య కట్టడ కూల్చివేతలో ముఖ్యమంత్రి శ్రీ కళ్యాణ్‌సింగ్ పాత్ర ఉన్నదని ఆరోపిస్తున్న ప్రధాని, ఇదే ఆరోపణను ఇందిర హత్య, తదుపరి జరిగిన 4వేలమంది సిక్కుల ఊచకోత విషయంలో ఆయనపై చేస్తే ఏమని సమాధానం చెబుతారు? హోంమంత్రిగా ఆయన పాత్ర కూడా ఆ హత్యలో ఉన్నదని ఎవరైనా అంటే ఆయన సహించగలరా? తామెంత నిజాయితీపరులో ఎదుటివారు కూడా అంతే నిజాయితీపరులన్నది విజ్ఞులు ఆలోచించే తీరు. దురదృష్టవశాత్తు మన ప్రధాని విజ్ఞతను కోల్పోయి వ్యవహరిస్తున్నారు.

## ప్రజాస్వామ్య హత్య

అయోధ్యలో డిసెంబర్ 6 నాడు సంభవించిన పరిణామాల తదుపరి కేంద్ర ప్రభుత్వం వ్యవహరించిన తీరు ఆ ప్రభుత్వాన్ని నడిపిస్తున్న పెద్దలకు ప్రజాస్వామ్యం పట్ల గల గౌరవప్రపత్తులేపాటివన్నది బట్టబయలైంది.

అయోధ్య సంఘటనలకు కేవలం ఉత్తరప్రదేశ్ ప్రభుత్వాన్నే బాధ్యురాలిని చేస్తూ బర్తరఫ్ చేయడం కేంద్రం పాల్పడిన మొట్టమొదటి అప్రజాస్వామిక చర్య.

ఇక రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్, విశ్వహిందూ పరిషత్, బజరంగదళ్‌లపై విధించిన నిషేధం మరొక అప్రజాస్వామిక చర్య. డిసెంబర్ 6వ తేదీవరకు ఈ సంస్థలన్నీ ప్రభుత్వం దృష్టిలో చట్టబద్ధ కార్యకలాపాలనే సాగిస్తున్నాయి. డిసెంబర్ 5వ తేదీనాడు

కూడా ఆరెస్సెస్ నాయకులతో ప్రధాని చర్చలు జరిపారు. కానీ 6వ తేదీ సంఘటనల తదుపరి ఒక్కసారిగా ఈ సంస్థలు ప్రభుత్వం దృష్టిలో చట్టవ్యతిరేక కార్యకలాపాలు సాగించే సంస్థలైపోయాయి.

మతతత్వ సంస్థలుగా ముద్రవేసి వాటిపై ప్రభుత్వం నిషేధించింది. పచ్చి మతోన్మాద సంస్థలైన ఐ.ఎస్.ఎస్., జమాతే ఇస్లామీలతో వాటిని సమానంగా పోల్చి, ప్రజల దృష్టిలో ఆ సంస్థల ప్రతిష్ఠను దిగజార్చాలని ప్రయత్నించింది. ఆఖరికి భారతీయ జనతా పార్టీని సైతం నిషేధించాలంటూ అధికార కాంగ్రెస్‌కు చెందిన కొందరు సభ్యులు చేస్తున్న అల్లరి కూడా కేంద్రం కుట్రలో అంతర్భాగమే.

విచిత్రం ఏమిటంటే 1979లో మహారాష్ట్ర అసెంబ్లీలో ఆరెస్సెస్‌ని నిషేధించాలని ఒక సభ్యుడు కోరినపుడు అప్పటి ముఖ్యమంత్రి శ్రీ శరద్‌పవార్ దానిని వ్యతిరేకిస్తూ సుదీర్ఘ సమాధానం ఇచ్చారు. 1989లో కాంగ్రెస్ సభ్యుడు శ్రీ జాఫర్ షరీఫ్ పార్లమెంటులో ఆరెస్సెస్‌పై ప్రశంశల వర్షం కురిపించారు. తాను చిన్నప్పుడు శాఖకు వెళ్ళానని, డా. హెడ్గెవార్ మచ్చలేని దేశభక్తులని శ్రీ షరీఫ్ ప్రశంసించారు. 'నమస్తే సదావత్సలే' అని ప్రార్థనను కూడా ఆయన గుర్తు చేశారు. ఈ ఇద్దరూ ప్రస్తుతం కేంద్రమంత్రివర్గంలో సీనియర్ సభ్యులు. నిషేధాన్ని గట్టిగా సమర్థించిన వారిలో వీరుకూడా ఉన్నారు. కాంగ్రెస్‌వారికి ఎన్ని నాలుకలుంటాయో!

దేశభక్తి, శీలం, అనుశాసనాలకు ప్రపంచవ్యాప్తంగా పేరెన్నిక గన్న ఆరెస్సెస్, దాని అనుబంధ సంస్థలు మన ప్రభుత్వం దృష్టిలో మాత్రం చట్ట వ్యతిరేక, మతోన్మాద సంస్థలైపోయాయి.

కేంద్ర మంత్రుల కాళ్ళు విరగగొట్టమన్న సయ్యద్ షహబుద్దీన్‌లకు, ఆయనగారి బాబరీ యాక్షన్‌కమిటీలకు ఈ దేశంలో గౌరవస్థానం లభిస్తుంది. ఇందిర హత్య తదుపరి ఢిల్లీ వీధుల్లో మారణహోమం సృష్టించిన వారు, రాజీవ్ హత్య తదుపరి హైదరాబాద్ వీధుల్లో రాక్షసకాండ సాగించిన వారు పార్లమెంటు సభ్యులు, శాసనసభ్యులుగా ఎన్నుకోబడతారు. వారంతా చట్టబద్ధ కార్యకలాపాలు సాగిస్తున్న వారి క్రిందే లెఖ్ఖ. మన నాయకుల బూటకపు సెక్యులరిజానికి ఇంతకంటే పరాకాష్ఠ ఏం కావాలి?

ప్రజాస్వామ్యానికి గొడ్డలిపెట్టులాంటి మరిన్ని సంఘటనలకు అయోధ్య నేపథ్యంలో కేంద్ర ప్రభుత్వం పాల్పడింది. శ్రీ అద్వానీ, డా. జోషీ, శ్రీ అశోక్‌సింఘల్ వంటి నాయకులను, సాధ్వి ఉమాభారతి వంటి తపోమూర్తులను అరెస్టు చేసి, జైళ్ళకు పంపింది. కనీసం వారిని కేసు నమోదు చేసి, విడుదల కూడా చేయలేదు. కరుడు గట్టిన ఖైదీలతో సమానంగా వారిని జైళ్ళలోనే ఉంచింది.

పార్లమెంటు సమావేశాలు సాగుతుండగా శ్రీ అద్వానీ అరెస్ట్ జరిగింది. ఆయన ప్రతిపక్ష నాయకుడు. కనీసం పార్లమెంటులో ఆయనకు తన వాదం వినిపించే అవకా

శాన్ని కూడా ఈ ప్రభుత్వం ఇవ్వలేదు. ఇంతకంటే అమానుషం, అప్రజాస్వామికం ఇంకేముంటుంది?

ఢిల్లీ వీధుల్లో వేలాది సిక్కులను ఊచకోత కోసిన భగత్, సజ్జన్‌కుమార్ వంటి కాంగ్రెస్ నాయకులు పార్లమెంటు సభ్యులుగా చెలామణీ అవుతున్నారు. హైదరాబాద్ వీధుల్లో అల్లర్లకు, దోపిడీలకు పాల్పడిన సుధీర్‌కుమార్, ముఖేష్ వంటి కాంగ్రెస్ నాయకులు శాసన సభ్యులుగా వెలగబెడుతున్నారు. ఈ సంఘవ్యతిరేక శక్తులేవీ ఇంతవరకు తాము చేసిన పాపాలకు జైలు ముఖం చూడలేదు. కాగా దేశభక్తికి మారుపేరైన శ్రీ అద్వానీ తదితరులు జైళ్ళలో మగ్గుతున్నారు. ఇదీ మన ప్రజాస్వామ్య మహత్యం.

కాగా మధ్యప్రదేశ్, రాజస్థాన్, హిమాచల ప్రదేశ్‌లలోని బిజెపి ప్రభుత్వాలను కేంద్రం రద్దుచేయడం ప్రజాస్వామ్య హత్య అని అనడం కూడా తక్కువే అవుతుంది. శాంతి భద్రతల సాకు చూపి కేంద్రం ఈ ప్రభుత్వాలను బర్తరఫ్ చేసింది. కానీ నిజానికి కాంగ్రెస్ పాలిత రాష్ట్రాలలో మత కలహాలలో 800 మంది మరణిస్తే బిజెపి పాలిత ప్రాంతాలలో కేవలం 200 మంది మాత్రమే మరణించారు. పైగా మూడు బిజెపి పాలిత రాష్ట్రాలలోను 3వ రోజుకు పరిస్థితి అదుపులోకి వచ్చింది. కానీ మహారాష్ట్ర, గుజరాత్, కర్ణాటక వంటి కాంగ్రెస్ పాలిత రాష్ట్రాలలో 7రోజుల వరకు మతకలహాలు రగులుతూనే ఉన్నాయి.

ఈ నేపధ్యంలో ప్రజాస్వామ్య పద్ధతులలో ఎన్నికైన ఆ ప్రభుత్వాలను రద్దుచేయడం ప్రజాస్వామ్యాన్ని నిలువునా ఖూనీ చేయడమే.

## ఎవరు మతతత్వ వాదులు?

బిజెపి, ఆరెస్సెస్ తదితర సంస్థలను మతతత్వ సంస్థలుగా నిందిస్తున్న నాయకులు, పార్టీలు తమతమ బ్రతుకులను తాము ఒకసారి తేరిపారి చూసుకోవలసి ఉంది.

ఎవరు పతివ్రతలీ ముత్తాలలో?

కేరళలో ముస్లింలీగ్‌తో కాంగ్రెస్, మార్క్సిస్టులు ఒకరిని విడిచి మరొకరు పొత్తులు పెట్టుకోలేదా? ఇవాళ కూడా కేరళలో అధికారంలో ఉన్న యు.డి.ఎఫ్.లో ముస్లింలీగ్ కూడా భాగస్వామియే కదా! మరి ఆ ముస్లింలీగ్ మతతత్వ సంస్థ కాదా? క్రైస్తవుల ఓట్లను కొల్లగొట్టుకునే ఉద్దేశంలో మిజోరాం ఎన్నికల సమయంలో అప్పటి ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ ఆ రాష్ట్రంలో ఏసుక్రీస్తు పాలనను నిర్మిస్తామని, బైబిల్ ఆధారంగా పరిపాలన సాగిస్తామని ఎన్నికల ప్రణాళికలో ప్రకటించలేదా? ప్రధానిగా ప్రమాణస్వీకారం చేసిన తదుపరి వి.పి.సింగ్ మొట్టమొటిగా ఢిల్లీలోని జమామసీదు ఇమాం సయ్యద్ అబ్దులా బుఖారీకి సాష్టాంగ ప్రణామాలు చేయలేదా? హైదరాబాద్‌లో మజ్లిస్‌తో పొత్తులు పెట్టుకొని టర్కీ టోపీలు పెట్టుకోని నాయకులెవరు?

మైనారిటీ కమీషన్‌కు చట్టబద్ధత కల్పించడం, ప్రార్థనా స్థలాల బిల్లును ప్రవేశపె

ట్టడం వగైరా చర్యలన్నీ కాంగ్రెస్ మార్కు మతతత్వం అంటే ఏమిటో స్పష్టంగా పేర్కొంటాయి. తాము సాగించే మతతత్వ కార్యకలాపాలకు వారు సెక్యులరిజమ్ అనే ఒక అందమైన ముసుగును * తొడుగుతారు.

అసలు దేశంలో మతతత్వం పేరిట ఎవరినైనా నిషేధించవలసి వస్తే అందరి కంటే ముందుగా కాంగ్రెస్‌నే నిషేధించవలసి ఉంటుంది.

## అయోధ్య నేర్పే పాఠాలు

అయోధ్యలో డిసెంబర్ 6వ తేదీన జరిగిన సంఘటనల నుండి అనేక గుణపాఠాలు నేర్చుకోవలసిన అవసరం ఉంది. ఈ దేశంలో ఇకపై హిందువుల మనోభావాలను నిర్లక్ష్యం చేస్తూ ఎవరూ మనుగడ సాగించలేరు. రాజకీయాలలో ద్వంద ప్రమాణాలకు, ఒంటెత్తు పోకడలకు అయోధ్య సంఘటనలు తగు సమాధానం చూపించాయి. మైనారిటీ బుజ్జగింపు మార్కు రాజకీయాలను ఇక హిందూ సమాజం ఎంతమాత్రం సహించబోదని అవి స్పష్టం చేశాయి.

మైనారిటీల బుజ్జగింపు అనేది మన జాతి పాలిట శాపంలా పరిణమించిన అంశాలలో ఒకటి. కాంగ్రెస్ సంస్థలోని నాయకులు స్వాతంత్ర్యానికి పూర్వం సాగించిన ఈ బుజ్జగింపు రాజకీయాలు జిన్నా, ఆయన అనుచరులు మరింత బలపడడానికి, చివరికి దేశం ముక్కలు కావడానికి కారణం అయ్యాయి. స్వాతంత్ర్యానంతరం సెక్యులరిజం పేరిట అవే బుజ్జగింపు రాజకీయాలను నెహ్రూవాద నాయకులు మోసుకు తిరుగుతున్నారు.

ఈ బూటకపు సెక్యులర్‌వాదుల దృష్టిలో 'హిందు' అనేది పచ్చి మతతత్వం. అది బూతుతో సమానమైన పదం. హిందువుల హక్కులను, కోర్కెలను కాలరాయడమే వీరి దృష్టిలో సెక్యులరిజం. సెక్యులరిజమ్ ముసుగులో ఈ నాయకులు కేరళలో మలప్పురం జిల్లాను ప్రత్యేక ముస్లిం జిల్లాగా నిర్మించి ఇచ్చారు. అక్కడ పాఠశాలలకు ఆదివారం శెలవు ఉండదు. శుక్రవారం ఉంటుంది. వేసవి శెలవులు ఉండవు. రంజాన్ శెలవులు ఉంటాయి. తమిళనాడులో దిండిగల్ జిల్లా పేరును గతంలో దేశ విభజనను సమర్థించిన మహమ్మద్ ఇస్మాయిల్ అనే నాయకునికి గల బిరుదు పేరిట ఖైద్-ఎ-మిల్లత్ జిల్లాగా పిలవడం సెక్యులరిజం. ఉత్తరప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం అలహాబాద్ పేరును ప్రయాగగాను, ఫైజాబాద్ పేరును సాకేత్‌గాను మార్చడం (అవి ఆ పట్టణాలు ముస్లిం దురాక్రమణలకు గురికాక ముందు ఉన్న పేర్లే) మాత్రం మతతత్వం అయిపోతుంది.

ఈ బూటకపు సెక్యులర్ రాజకీయాలను సహించిన కారణంగానే ఈ దేశంలో కాశ్మీర్ సమస్య తల ఎత్తింది. పంజాబ్, అస్సాంలలో వేర్పాటువాదం విశృంఖల నాట్యం చేస్తోంది. జాతీయ అస్తిత్వానికి స్థానం లేకుండా పోయింది. ఈ పరిస్థితులను మార్చడమే అయోధ్య ఉద్యమ ప్రధాన లక్ష్యం.

అయోధ్యలో బాబరీ కట్టడం ఈ బూటకపు సెక్యులరిస్టులకు ప్రతీక. దానిని

తొలగించడం అనేది జాతీయ వాదులు నిర్వహించిన ఒక ట్రయల్ మాత్రమే. ఈ ట్రయల్‌లో విజయం లభించినట్లైతే కాశ్మీర్ సమస్య పరిష్కారం అవుతుంది. దేశంలో వేర్పాటువాదం నామ్ నిశానీ లేకుండా పోతుంది. తన జాతీయ అస్తిత్వాన్ని గుర్తించి జాతి సమైక్యంగా ముందుకు సాగగలుగుతుంది. అయోధ్యను ఈ దృష్టితోనే అవలోకన చెయ్యాలి.

## మస్జిద్ వహీ బనాయేంగే?

ఇంత జరిగినా మన బూటకపు సెక్యులర్ నాయకులకు ఇంకా మైనారిటీల ఓట్లపైన మోజు తీరలేదు. కనుకనే కూలిన మసీదును తిరిగి నిర్మిస్తామని, అక్కడే నిర్మిస్తామని బీరాలు పలుకుతున్నారు. సంకుచిత మతమౌఢ్య ముల్లా మౌల్వీలు కొందరు ప్రభుత్వంపై మసీదును తిరిగి నిర్మించాలంటూ ఒత్తిడి తెస్తున్నారు. అలాంటి ఏ ప్రయత్నం జరిగినా అది ముస్లిం సమాజం పాలిట ఆత్మహత్యా సదృశ చర్య మాత్రమే అవుతుంది.

బాబరీ మసీదు భారతీయ ముస్లింల పాలిట పెద్ద శాపం. మసీదుకాని ఆ మసీదును అడ్డం పెట్టుకుని ఇంతకాలం కుహనా సెక్యులర్ నాయకులు, మత మౌఢ్య ముస్లిం నేతలు తమ రాజకీయ ప్రయోజనాలను కాపాడుకుంటూ వచ్చారు. ఆ కట్టడాన్ని చూపి సామాన్య ముస్లింలను రెచ్చగొట్టారు. అసలు విషయం తెలియక మతావేశంతో వీధిన పడ్డ ముస్లిం ప్రజలను తమ పోలీసులచేత నిర్దాక్షిణ్యంగా కాల్పించినది కూడా ఈ నేతలే. మొన్నటి అల్లర్లలో మరణించిన వెయ్యిమందిలో 75శాతం మంది ముస్లింలేనన్న వాస్తవమే ఇందుకు నిదర్శనం. బూటకపు సెక్యులరిస్టుల రాజకీయాలు భారతీయ ముస్లింలకు ఏనాడూ శాంతిని, సుఖాన్ని, ప్రగతిని ఇవ్వలేక పోయాయి. మత కలహాలు, మారణ హోమాలను మాత్రమే అవి వారికి మిగిల్చాయి. ప్రధాన జాతీయ జీవన స్రవంతిలో హిందువులతో వారు కలిసి మెలిసి జీవించకుండా అవి అడ్డుపడుతూ వచ్చాయి. హిందువులు ముస్లింల మధ్య ఇనుపగోడలా అవి నిలబడ్డాయి.

బాబరీ కట్టడం కూలిపోవడంతో ఆ ఇనుప తెర తొలిగి పోయినట్లైంది. ఇక ముస్లిం సమాజం దాని గురించి మరచి పోవడమే శ్రేయస్కరం. క్షణికమైన మత దురభిమానం, అభినివేశాలకంటే శాశ్వతమైన తమ భవిష్యత్తు, శ్రేయస్సుల గురించి వారు ఆలోచించాలి. అలా ఆలోచించినపుడు హిందూ సమాజానికి ముస్లిం సముదాయంపై ద్వేషం, సందేహాలకు కారణభూతంగా నిలుస్తూ వచ్చిన బాబరీ కట్టడం తొలగిపోవడమే శ్రేయస్కరమని వారు తప్పక గ్రహిస్తారు.

బాబరీ కట్టడాన్ని తిరిగి నిర్మించడం వల్ల ఒరిగేదేముంది? హిందువులకు ఆ కట్టడంపైన మరింత ద్వేషం పెరుగుతుంది. తాము పవిత్రంగా భావించే శ్రీరామ జన్మభూమిలో మసీదు నిలిచి ఉండడాన్ని వారెంత మాత్రం సహించబోరు. అప్పుడు

అయోధ్యలోని పిడికెడు మంది ముస్లింలు ఆ మసీదును పరిరక్షించుకోగలరా? ఒకవేళ పరిరక్షించుకున్నా మళ్ళీ అది దేశవ్యాప్తంగా హింస, మతకలహాలకు కారణభూతం కాదా?

'మస్జిద్ వహీ బనాయేంగే' అని జబ్బలు చరుచుకుంటున్న వారు ఈ సత్యాన్ని గ్రహించాలి. భారతదేశంలో ముస్లింల శ్రేయస్సు, సెక్యులరిజం మనుగడ కూడా వారు అనుకుంటున్నట్లు మసీదును పునర్నిర్మించడంలో లేదు. మెజారిటీ సమాజమైన హిందువులతో పాలల్లో తేనెలా కలిసిపోయే మనస్తత్వాన్ని ముస్లిం సమాజంలో నిర్మించడంలోనే అవి ఉన్నాయి. ఈ సత్యాన్ని గ్రహించి ముస్లిం నాయకత్వం మసలు కుంటే సమస్య ఇంతటితో ముగుస్తుంది. లేకుంటే ఈరోజు అయోధ్యలో జరిగిన సంఘటనలు రేపు మూడు వేల ఇతర స్థలాలలో పునరావృత్తం కావని గ్యారంటీ ఏమిటి?

**ఉపసంహారం**

అయోధ్యలో జరిగిన సంఘటనలు ఒక మతంపై మరొక మతం సాధించిన విజయంగా భావించడం ఎంతమాత్రం సరికాదు. అయోధ్య మతాల మధ్య పోరాటానికి కేంద్రం కాదు. జాతీయ వాదానికి, బూటకపు లౌకికవాదానికి మధ్య జరిగిన పోరాటానికి మాత్రమే అది కేంద్రం అయింది. దురదృష్టవశాత్తు భారతీయ ముస్లింలు ఇంతకాలం బూటకపు సెక్యులరిస్టులనే నమ్ముకుంటూ వచ్చారు. కనుక అయోధ్యలో తమకే పరాజయం జరిగిందని వారు భావిస్తూ ఉండవచ్చు.

అయితే అది సరికాదు. ఈ దేశంలో ఇస్లాంకు ఎటువంటి ప్రమాదము లేదు. వారి ప్రార్థనా స్థలాలకు ఎటువంటి విపత్తూ రాబోదు. అయితే ఈ హామీని కేవలం అధిక సంఖ్యాక హిందూ సమాజం మాత్రమే వారికి ఇవ్వగలుగుతుంది. హిందూ సమాజ మనోభావాలను కూడ ఆదరిస్తూ వారితో కలిసి మెలిసి జీవించడం ముస్లింలు నేర్చుకున్ననాడు వారి మతం, ప్రార్థనాస్థలాలు కూడా భద్రంగా ఉంటాయి. వాటి భద్రతకు హామీ హిందూ సమాజ సౌహార్ద్రత తప్ప బూటకపు లౌకికవాదుల నినాదాలు కాదు.

అయోధ్య సంఘటనలు నూతన జాతీయ నవోదయానికి సంకేతాలు. ఒక జాతి తన సంకెళ్ళను ఛేదించుకుని అస్తిత్వాన్ని ప్రకటించుకున్న అమరక్షణాలవి. దాదాపు 75 సంవత్సరాల తదుపరి మళ్ళీ హిందూ సమాజం తనదైన గుర్తింపుతో లేచి నిలిచిన సమయమది.

జాతీయ అస్తిత్వాన్ని విస్మరించిన ఏ జాతికీ భవిష్యత్తు ఉండబోదు. స్వాతంత్ర్యానంతరం మన నాయకత్వం మన జాతీయ అస్తిత్వాన్ని దెబ్బతీసే ప్రయత్నం చేసింది. హిందువు ఆ ప్రయత్నాలను సాహసంతో ఎదుర్కొన్నాడు. ఎదురు దెబ్బ తీశాడు. విజయుడై బైటకు వచ్చాడు.

ఇప్పుడిక ముందున్నదంతా వైభవమయ కాలఖండమే.....రామరాజ్యమే.....

జైశ్రీరాం

* * *



చరిత్ర దురాగతానికి కరసేవకుల ఆగ్రహానికి సమన్వయం సాధించే దెలా - సంయమనాన్ని నిర్మించేదెలా ఆలోచనల్లో పడ్డ అగ్రనాయకులు.



అయోధ్యలో హిందూ జనసాగరం
అపారకరసేవా సేన కెరటం



ఈ మట్టినాది - ఈ ఇటుకనాది - ఈ ధూళినాది
దీనికై అవిశ్రాంతంగా కదులుతానంటున్న కరసేవక గణం



కట్టలు తెంచుకొన్న కరసేవకుల ఆగ్రహాగ్నిని
నిగ్రహించేదెలా - అనే ఆలోచనల్లో నాయకులు





మనస్సు ముఖ్యం - కారెవరు కరసేవకనర్హం
సాధువు-గృహిణి-రైతు-విద్యార్థి ఎవరైనా అర్హం.









గుమ్మటాలు కూలె, గుర్తులు మందిరానివి మిగిలె
శిథిల శిల్పపు గాథలన్నీ వ్యథలు - కథలు



శతాబ్దాల బాబర్ బానిస చిహ్నాన్ని
కూల్చే హిందూ ఉగ్ర నరసింహ మూర్తిమత్వం.

• 'మందిర మచ్చటే నిర్మిస్తాం' మాటను నిలబెట్టుకున్న కరసేవకులు



సాధువులైన ధర్మాచార్యులే ఆగ్రహిస్తే.... ధరణి కంపించదా!



స్వర్గీయ శ్రీ లక్ష్మణ యతీంద్రులు

